# 226

అవ  శ్రీనివాసుడు మన్నించకుంటే ఆశామోహాదులను జీవుడు జయింపజాలడను చున్నాడు

సీ.  విడిచిపోవని యాశ విజ్ఞానవాసనఁ
          గడచి మున్నాడె నెక్కడిది వివేక?
     ముడుఁగ నీయని మోహ మొగి పరమార్థమ్ము
          మెడఁబట్టి నూకె నేమిటికి నెఱుక?
     పాయనీయని మహాబంధ మధ్యాత్మతో
          రాయిగీసీని సైరణ మిఁకెట్లు?
     మాయనీయని కోపమహిమ కృపామతి
          వాయెత్తనీయ దెవ్వరికిఁ జెపుట?

గీ.  ఆత్మచాంచల్య మెల్లప్పుడంతరాత్మ
     నెఱుఁగ నీయదు పరిణతి లేద తనకు।
     ఫణిగిరినివాసు మన్నింపువలనఁ గాని
     వెరసి యిన్నింటి గెలువంగ వెరవు లేదు.

వదలకుండ ఉండే ఆశ విజ్ఞానాన్ని వెనకకునెట్టి తాను ముందు నిలుస్తున్నది. ఇక తెలివి ఎక్కడుంటుంది? ఉండదని భావము. విడువరాని మోహం (అజ్ఞానం) పరమార్థాన్ని మెడపట్టి గెంటుతూంది ఇక ఎఱుక (ఆత్మజ్ఞానం) ఎక్కడుంటుంది, ఉండదని తాత్పర్యం. వీడని సంసారబంధం అధ్యాత్మవిద్యతో ఒరుసుకొంటుంది. ఇక ఓర్పు ఎట్లా వుంటుంది? ఉండదన్నమాట. మానిపోని కోపోద్రేకం దయాబుద్ధిని నోరెత్తనీక ఒత్తేస్తున్నది. ఈ సంగతి ఎవరికి చెప్పుకొనేది। దీన్ని బాగుచేసేవారే లేరనుట. చంచలమైన మనస్సు ఎప్పుడుగాని ఆత్మను తెలుసుకోనీయదు. ఇక ఆత్మజ్ఞానంలో పరిపక్వస్థితి తన కెక్కడిది? ఉండదని భావం. అయితే పై వాటి నన్నిటిని జయించవలెనంటే శ్రీవేంకటేశ్వరుని మన్నింపు అనుగ్రహం కావలెనేగాని వేరేమార్గం లేదు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| జీవుఁ డెంతటి వాఁడు | 68 | 327 | 1 | 218 |

## 227

అవ పలుదేవత లుండగా శ్రీనివాసునందు మహిమాతిశయ మచేత మనస్సు లగ్న మైన దనుచున్నాడు.

సీ. కారుచీకటిమూక కలుగంగ నెల్లెడ
వెలుఁగు లోకమ్ములఁ వెలసినట్లు
మునుకొని పాతకమ్ములు గల్గఁ జపు లాయె
జనములకున్ పుణ్యసంచయములు
ఇనుముగల్గిన హేమ మింపై విషము గల్గ
నమృతమ్ము మిపులనే లయిన యట్లు
వగపు జనింపఁగా వడివడి సంతోష
మగపడు టిందఁట కబ్బె మాయె

ఆ. బహుళదైవతములు పరగంగ మనసాయె
మధువిరోధియందు మహిమచేత
నిహ మనుగ్రహింప వృషశైలపతి పరం
బంతకంటె నిష్ఠమైన యట్లు.

అంతట కారుచీకట్లు క్రమ్ముకొనగా లోకాలలో వెలుగు జనించినట్లు, పాపము లలముకొనగా జనులకు పుణ్యములు రుచియైనట్లు, ఇను ముండగా బంగారము, విషముండగా అమృతము ఇష్టమైనట్లు, కష్టములు కలుగగా నంతోషం కనిపించడం అందరికీ ఆశ్చర్యకరమైనట్లు, పలు దేవత లున్నప్పటికినీ మధువనే రాక్షసుని మట్టు పెట్టిన శ్రీ వేంకటేశ్వరునిపై ఆయనలోగల మహిమవల్ల మనస్సు లగ్న మవు తున్నది. శ్రీకుడు ఇహలోకసుఖాలు ఎంతగా ఇచ్చినను పరలోకసుఖము అంత కంటె ఇష్టమైనది. పదమువద మే ప్రార్థన మని సారాంశం.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కలుషపు చీకటి | 80 | 51 | 11-2భా | 187 |

## 228

అవ: భక్తిగలవాడు, ఇతరములను మఱచిపోతాడు. గురుభక్తిగలవాడు ఆత్మజ్ఞానం పొందుతాడు. భక్తిగలవానికి ఇహపరసుఖాలు అఱచేతిలో నుంటాయి.

సీ. పొద్దుపొద్దును దలంపున హరిం దలపోయ
నొద్దిక పలుచేఁతలున్న మఱచు
నిద్రితుచేతిలో నిమ్మపండుం బోలె
క్షణములో కర్మముల్ జాఱిపోవుఁ
బలుమారు గురుసేవ పరగంగ పరగంగఁ
జలివాసి యాత్మవిజ్ఞాన మొదవుఁ
గలగన్నవాఁడు మేల్కనిన స్వప్నమువలె
బహుళసంసారమ్ము భావన యగు,

గీ. ఫణినగాధిపునిఁదాఁదను భక్తివాఁడను
నిహపరసుఖమ్ము లఱచేత నెసఁగుచుండుఁ
బరుస ముంటిన లోహంబు నెరసు దొలఁగి
పదియు నార్వన్నె పసిఁడియై పరఁగుగాదె!

ఎల్లప్పుడు హరిని స్మరిస్తుంటే లౌకికవ్యాపారాలు మరుగౌతాయి. నిద్రపోతున్నవానిచేతినుండి నిమ్మపండు వానికి తెలియకనే జారిపోయేట్టుగా, ఒక్క-క్షణంలో అన్నికర్మలు వానినుండి జారిపోతాయి. విశేషంగా గురువును సేవించగా సేవించగా సందేహాలు తీరి ఆత్మజ్ఞానం అబ్బుతుంది. అట్టివానికి అసారసంసారం నిద్రనుండి మేల్కొన్నవానికి స్వప్నంవలె భావనామాత్రమే అవుతుంది. ఏడుకొండలవానిపై భక్తి అధికమైతే ఇహపరసుఖాలు కరతలామలకాలౌతాయి. పరుసవేదిసంబంధం వల్ల లోహం తన మాలిన్యాన్ని పోగొట్టుకొని పదారువన్నెబంగారమై ప్రకాశిస్తుందిగదా! అలాగే శ్రీనివాసుని భక్తిప్రభావంవల్ల భక్తుడు లోకోత్తరుడౌతా డన్నమాట.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| నేనైతె విడువవద్దు | 370 | 119 | 11-1భా | 80 |

# 229

వ. శ్రీహరికథలే ఆలింపవలెనని ఘంటాపథంగా చెప్తున్నారు.

సీ. వెలఁదులసుద్దులు వీనుల విన్నచోఁ
దెలుచఁ జూపులఁజూడఁ బ్రేమ గలుగు
నలసి యా చూపులు మనసునఁ దగిలించుఁ
దలఁపు మాటాడఁగఁ దమిని చేయు
మగువలతో గూడ మాటాడ నోరకొన్న
నగుచు సంసారంపునంటుఁ గూర్చుఁ
దగిలిన నవ్వులు తనువుసోఁకఁగ జేయు
దనువుసోఁకులు వలపునకుఁ దార్చు

గీ. సతులమోహమ్ము కోరించు సంపదలకు,
సంపదలు చేసి నెవ్వ నజ్ఞానిఁ జేయు,
మొదలనే యెచ్చరికతోడ మోసపోక
వెదకి శ్రీహరిగాథలే వినఁగ వలయు.

అతివలవృత్తాంతాలు ఆలకించగా వారిని చూడవలెనని కోరిక పొటమరిస్తుంది ఆ చూపులె వారిపై మనసును నిలుపుతాయి ఆ మనసే సంభాషింపవలెనని కోరికను రేపుతుంది. వనితలతో సంభాషణము చేయుటకు పూనుకొన్నచో ఆ సంభాషణ అలవోకగా సంసారమును తగిలించగలదు. హాస్యాలు వారిశరీరసంపర్కమును కలిగించును శరీరసంపర్కం ప్రేమపరాకాష్ఠను పొందిస్తుంది. స్త్రీలపై మోహం సంపదలను సంపాదించుటకు కోరకలిగిస్తుంది. సంపదలు మానవుని అజ్ఞానిగా చేయును కనుక మొదటనే మోసపోక తెలివితో జాగ్రత్తగా శ్రీహరికథలనే వినవలెను.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| మొదలనే యెచ్చరికతో | 156 | 287 | 2 | 179 |

# 230

అవ. అందరిలో భగవంతు డున్నప్పటికినీ యోగ్యతాయోగ్యతలు గుర్తించ వలె ననుచున్నాడు

సీ. అన్నిట హరిదాసు లధికు లింద్రాదిదే
　　　వతలకుఁ గన్నులవంటివార,
లెల్లరలో హరి యొసఁగిన నెసఁగునా
　　　తారతమ్యత లరయ వలదె?
భూసురప్రముఖునిఁ బూజించి నటువలె
　　　శునకముఁ బూజింప శుభము గలదె?
అన్నిమతా లొక్కటైన వాసియు లేదె?
　　　తోలుబిల్లలును టంకాలు సమమె?
గీ. పైరు నాటంగ గాదమ్ము బలిసినట్లు
కతమకర్మమ్ము లెన్నియో కలుగఁ గాక
అంజనగిరీశు పదదాస్య మట్టు లొక్క
టైనది మఱొక్క ముక్త్యుపాయంబు లేదు.

హరిభక్తులు ఇంద్రాదిదేవతలకు కన్నులవంటివారగుటచేత అన్నివిధాల వారు గొప్పవారు. అందరిలో భగవంతు డుండుగాక. భగవదధిష్ఠానముల పాత్రాపాత్రతలను విచారింప వలదా? విచారింపవలెనని భావము. దేవుఁ డంతట వున్నాడని బ్రాహ్మణోత్తముని పూజించిన విధంగా కుక్కను పూజిస్తే క్షేమం కలుగునా? కలుగదని భావం. తోలునాణెములు, బంగారువెండినాణెములు సమానములా? కావని తాత్పర్యము. అట్లే మతములన్నీ ఒకటే అయినా వాటిలో షేలంకీతలు లేవా? ఉన్న వనుట. పైరులో కలుపు బలిసినట్లు ఎన్నెన్నో కర్మలు ప్రబలమగుగాక. అంజనాధిపుని పాదదాస్యము ముక్తికి ఉపాయమైనట్లు కర్మయోగాదు లేవియును కావని సారాంశము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| అన్నిటాను హరిదాసు లధికులు | 180 | 170 | 2 | 144 |

# 231

అవ అభ్యాసయోగంవల్ల జీవుడు బ్రహ్మపదాన్ని పొందుతాడని పలుకుతున్నాడు

సీ. ఇంటిలోని యిరుల నిట్టె తప్పక చూడఁ
గొంతవడికి వెల్గు గోచరించు,
అంటి కానఁగరాని యాత్మఁ దప్పక చూచు
కొన్నచోఁ గొబ్బున గోచరించు,
కఠినంపురాతిపైఁ గడవను బెట్టిన
నంచెలఁ దా గుదురైన యట్లు
తెలమి శ్రీహరినామ మేప్రొద్దు నాలుక
నుంచగా సుజ్ఞాన మొదవు తనకు,
గీ. ఒక్కొకపదంబు ముందున కోర్కి నిడఁగ
నెక్కుడగు కొండనేనియు నెక్కఁ గొనకు,
దినదినమ్మును గొలువంగఁ దిరుమలేశుఁ,
బరఁగ జీవుండు తా బ్రహ్మపట్ట మెక్కు.

ఇంటిలోని చీకట్లను అట్టే వదలకుండా చూస్తుంటే కొంతసేపటికి వెలుగు కన్పిస్తుంది ఇది అనుభవసిద్ధం కాకి తెలుసుకోడానికి సాధ్యంకాని ఆత్మను వదల కుండా లోచూపున చూస్తూ ఉంటే తటాలున గోచరిస్తుంది కఠినరాతిమీద కుండను ప్రతిదినం ఉంచుతుంటే అచోట పల్లం (కుదురు) ఏర్పడుతుంది ఆ విధంగానే ఎప్పుడూ హరినామం జపిస్తుంటే క్రమంగా జ్ఞానం మొలకెత్తుతుంది ఒకొక్క అడుగు ముందుకు వేస్తుంటే ఎత్తయిన కొండకొనకైన ఎక్కవచ్చు ఆ ఛందంగా ప్రతిదినం తిరుమలయ్యను సేవిస్తుంటే ఈ జీవుడే బ్రహ్మపట్టం పొందుతాడు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| పట్టినచోనే వెదకి | 87 | 428 | 1 | 295 |

## 233

అవ. నిర్గుణబ్రహ్మము నుపాసించే ఎంతవారైనా సగుణపరబ్రహ్మముగా వెలసి యున్న వేంకటప్రభుని సేవించకుండడమే పాషండమతమని హెచ్చరించుచున్నాడు.

సీ. అన్యశాస్త్రములు సహజాచారములు వీని
సరి నమ్మకుంట పాషండమతము,
నిద్రితుచేతిలో నిమ్మపండువిధాన
నరగఁ గర్మములు జాఱుఁగాక
భోగకాంక్షలు పొద్దుపొద్దునఁ గర్మసం
చయ మొల్ల ననుట పాషండమతము,
కలగన్నవాఁడు మేల్కనినంత విశ్వము
తలఁగి యెందేనియు డాఁగుఁగాక
ఇల నీ తనువు మోచి యెల్ల కల్ల యటంచు
చాటి చెప్పుటయు పాషండమతము,

గీ. కంట తనరూపు నద్దానఁ గాంచినట్లు
గరిమ తన యాత్మఁ గాంచినఁ గాంచుఁగాక
పరమసాకార వేంకటబ్రహ్మము గని
సరగ భజియింప కుంట పాషండమతము.

అనగా జన్మతో వచ్చిన ఆచారాలు శ్రీవిష్ణునియొక్క ఆజ్ఞలు. వీటిని పరిపూర్ణంగా నమ్మకపోవుట వేదబాహ్యమతము

నిద్రపోతున్నవానిచేతినుంచి నిమ్మపండు అతనికి తెలియకనే ఎల్లగా దొర్లిపోయినట్లుగా నిష్కాముని కర్మలు వదలిపెడితే వదలిపెట్టుగాక! కాని ఎల్లకాలం భోగానుభవాభిలాషకలవాడు కర్మలను తా నొల్ల ననుట పాషండమతమె. కలగన్నవాడు మేల్కన్నపిదప అతడు కలలో చూచిన ప్రపంచం ఎక్కడైనా దాగవచ్చుగాక! ఈ ప్రపంచంలో శరీరం మోస్తూ ఉంటూనే జగత్తు మిథ్య అని దండోరా కొట్టడమే పాషండమతం. తన ప్రతిబింబాన్ని కంటితో అద్దంలో చూచే మాదిరి తనలోని యాత్మను దర్శించవచ్చుగాక! సాకారంగా వెలిగే పరబ్రహ్మ శ్రీనివాసుడు అట్టివానిని భజించకుండుటే పాషండమతము శ్రీనివాసారాధనము వేదవిహితమని సారాంశము

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| సహజాచారములెల్లా | 88 | 431 | 1 | 289 |

# 234

అవ : మేలైన జీవితమును నిర్వచించుచున్నాడు

సీ. కంతలేని గుడిసె గంపంత యైనఁ జాలు
  తిట్టులేని బ్రదుకు దినమె చాలు
జంతగాని చెలి యే జాతిదైనను చాలు
  లంపటపడని మేలు లవమె చాలు
వింతలేని ధనమ్ము వీసమైనను జాలు
  ముట్టులేనిది కూఁగు ముద్దచాలు
కడు జాలిఁ బడుకంటెఁ గలిగినదే చాలు
  కట్టులేని సుఖమ్ము రవ్వచాలు
గీ. అప్పులేని సంసారము లయినపాటి
తప్పులేని జీతమె చాలు తార మేని
చింతలేని యంబలి చాలు చేరెఁ డేని
ఫణిగిరీశ్వరుఁ జేరెడు భవమె చాలు.

ఎండవానలకు గురిగాక ఒట్టంగా ఉండే గంపంత గుడిసె యైనను మంచిదే పలునోళ్ళలో నానక బ్రతికే బ్రతుకు ఒకనాటిదైనా మేలే. ధూర్తురాలు కాని స్త్రీ ఏ జాతిదైనను మంచిదే ఎంతో కష్టించక కొద్దిపాటి సుఖంతో తృప్తి పొందుటయే ఉత్తమం అన్యాయంగా ఆర్జించే అధికధనం కంటె ధర్మయుక్తంగా సంపాదించినది కొంచెమైనను మేలే కాకి కుక్కలు ముట్టని అన్నము గుప్పెడైనను పవిత్రమే. దురాశతో అందరినీ యాచించి దైన్యం చెందుటకంటె కలిగినకొద్దియే గొప్ప అడ్డు పడని సుఖం అల్పమైనను అది గొప్పదే అప్పుచేయక కలదానితో కాపురం జరుపు కొనుట మేలు తప్పులుచేయక సంపాదించిన జీతము నాల్గురాళ్ళు ఐనను మంచిదే ఏ చింతలు లేక చేరెడు అంబలి త్రాగుటయే గొప్ప. నాగనగనాథుని సాన్నిధ్యం కలిగించే పుట్టుకయే శ్రేష్ఠమైనది.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుటి | పుట |
|---|---|---|---|---|
| అప్పులేని సంసార | 19 | 114 | 1 | 78 |

# 235

అవ । నారాయణుని మహిమను, నరుని అజ్ఞతను వివరించుచున్నాడు

సీ. పదికోట్లజన్మాలఁ గాయని కర్మంపుఁ
  గాటుల నితఁడు తీర్పంగఁ గలఁడు
బహుళమౌ నారక కూప పటలి ద్రోయించెడి
  పాపమ్ము లితఁడు మాపఁ గలఁడు
వదలని సంసార బంధాల విడఁ జని
  వేగ మీతఁడు విడిపింపఁ గలఁడు
పండియుఁ బండదు మాడుచిత్తము పలు
  కాంక్షల యెడలఁ గ్రాఁగినాము

గీ. కనవు దాసుల రక్షింపఁ దలఁపుఁ గొన్న
వేంకటేశ్వరు దర్శింప వేడ్క గాని
సన్నుతియింత యున్న యాసక్తి గాని
కొలుత మను కోర్కెయుం గాని కలుగ దకట!

ఎన్నియో జన్మలనుండి వదలని కర్మసంబంధములగు పాట్లను తీర్చగలవాడు, అధికమైన సంచితపాపముల సముదాయముతో పడద్రోయు పాపములను పోగొట్టువాడు, వీడని సంసారబంధాలను వీడం జని త్వరగా విడిపించువాడు ఈ శ్రీనివాసుడే, ఎన్నాళ్ల పాగు మేము అపరిపక్వబుద్ధులమై కోరికలనే మంట మెండలలో మలమల మాడిపోతిమి. తన దాసులను కాపాడుటకు సిద్ధంగానున్న శ్రీవేంకటేశ్వరుని దర్శించవలెనన్న ఉద్దేశం కాని, అనురాగంతో ఆయనను స్తోత్రం చెయ్యాలనే సన్న ఆశ కాని, ఆ పురుషుని సేవించవలెనన్న కోరిక గాని, అయ్యో! మాకు కలుగకున్నది.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పట |
|---|---|---|---|---|
| బంగాళ / పంతువరాళి | 46 | 274 | 1 | 183 |

# 236

అవ ఫణిశైలవాసి, మానసనివాసి కాగా, ఇతరములకై [illegible] పెట్టితన మని మందలిస్తున్నాడు.

సీ. చింతనీయుండు మాచిత్తములో నుండ
        చింతవిచారాల చేష్టలేల ?
శ్రీలిచ్చు పరుసము చేతిలో నుండంగ
        దొంతరవిద్యల త్రోవ లేల ?
తోడునీడై యచ్యుతుఁడు కాయుచుండంగ
        జాడదప్పి చరించు జాలియేల ?
కోక లేకున్నా వేసి కొక్కరాలను జూచి
        వెంబడి పరువెత్తు వేడుకేల ?

ఆ. ఎల్లకడల వేంకటేశ్వరుం డుండంగ
బలియు నితని వీడు భ్రాంతియేల ?
వెల్లధాన్యములును నింటిలోఁ గలుగంగఁ
బొల్లుకట్టు దంచు బుద్ధియేల ?

భావింపదగిన మహానుభావుడు భావంలో నుండగా చింతవిచారాలు నంపే పెట్టి ఎందులకు? అనవసర మనుట. సంపదలిచ్చే పరుసవేది చేతనుండగా, విద్యాపరంపరల నేర్పడ మెందులకు? అనావశ్య మనుట. అసగా ఆత్మలో శ్రీశు డుండగా ఆ దేవుని కాదని చచ్చుపుచ్చు విద్యలు హెచ్చుగా నేర్చిన నేమియు లాభము లేదని తెలియవలయును. నాశం లేని ఆ స్వామి వదలక అండదండగ నుండగా ఆ రాజమార్గాన్ని వదలి దయనీయంగా తిరుగాడనేల? తిరుగాడ రాదనుట. భగవంతుని కాదని లక్ష్యము నాశ్రయింపరాదని భావము. మడుగున స్నానమాడువారు, [illegible] కట్టుకొని, ఎక్కడో గుంపుగానున్న కొంగలను చూచి అవి తమ వస్త్రాలని భ్రమించి వాటివెంట వ్యర్థంగా పరుగిడి అలసట చెందు టెందులకు? వ్యర్థ మనుట. ప్రాప్యవస్తువు భగవంతుడు తనలోనే ఉండగా ఇతరత్ర వ్యర్థంగా అన్వేషింపరాదని తాత్పర్యము. ఏడుకొండలరాయడు ఎల్లెడల నిండియుండగా ఆ బలియుని వదలి వేరే భ్రమ ఎందులకు? పనికిరాదనుట. గట్టిగింజలు పుష్కలంగా ఇంట్లో నుండగా పొల్లును దంచవలెననే బుద్ధి ఎందులకు? [illegible] రాదనుట. శ్రీశుడు గట్టి ధాన్యము, ఇతరులు గల్లపొట్టువంటివా రని తాత్పర్యము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| ఓపితేఁ దానే తగిలి | 233 | 190 | 3 | 127 |

# 237

అవ ముక్తి పొందుటకు సాధనసంపత్తిని తెలుపుచున్నాడు.

సీ. కలుష మ్ముడిగి కర్మగంధము గడచి తా
    వెలిఁగినప్పుడు గదా వెలఁగు ముక్తి
చలనమ్ము లేక సంసారవార్నిధి దాఁటి
    నిలచినప్పుడు గదా కలుగు ముక్తి
ఇంద్రియమ్ముల గెల్చి యిందిరావిభుమీఁద
    భక్తి నిల్పినఁ గదా పరఁగు ముక్తి
ఆస లన్నియు మాని యాచార్యపదసేవ
    మించి నప్పుడు గదా మెఱయు ముక్తి

గీ. శాంతమే కూడుగా సమస్తాంతవృత్తి
మింతు కెక్కిన యపుడెగా మలయు ముక్తి
అహరహంబును కరుణించి యాదరించి
నవ్వుచున్నది ముక్తి హృదంతరమున.

పాపకృత్యములు చేయక, కర్మఫలమును వదలి వెలుగునపుడు, ఒడుదొడుకులు లేక సంసారసాగరాన్ని దాటినప్పుడు, ఇంద్రియములను జయించి ఇందిరాసుందరునిపై భక్తి నిలిపినపుడు, ఆశలను విడిచి గురుపాదసేవతో చెలగినపుడు, శాంతమే జీవనముగా గల్గి సర్వసమబుద్ధిప్రవృత్తితో ప్రసిద్ధి కెక్కినప్పుడు, ఆపై ప్రభువు దయ ఉంచి ఆదరించినప్పుడు ముక్తి కలుగును ఆ ముక్తి భక్తుని హృదయాంతరాళంలోనే ఉన్నది

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుటం | పుట |
|---|---|---|---|---|
| ఆ ఎరే కలుగునా | 198 | 505 | 2 | 341 |

## 238

అవ  సంసారి చింతలతో సతమతమౌతాడుగాని దరిచేరడే యని వాపోవుచున్నాడు.

సీ. మూల్గుచు భారంపుమోపును మోయువాఁడు
సొలసి దించుకొనును నాఁటనాఁటి,
అయ్యయ్యో! సంసారి కదియు లేదాయెను
బరువు దించుకొనంగ తెరువు లేదు,
చింతింపఁగా వేపచేఁదును ద్రావువాఁడు
తెపినత మెసవు తీపేమి యైన
సకట! సంసారికి నదియు లేదాయెను
తీపు చేఁదె యెక్కడఁ దీపి లేదు,
గీ. దుస్సహంబగు హేయంబు తోఁడువాఁడు
కలప మొకయింత తనమేన నలఁదుకొనును,
ఔర! సంసారి కగియు లేదాయె, చింతఁ
బొరలుటయె గాని కొంతప్పు నెఱుఁగ లేఁడు.

మూల్గుతూ బరువైన మోపులు మోసేవాడు అక్కడక్కడ శ్రమ దీర్చుకొని ఒకచో బరువును దింపుకుంటాడు. అయ్యో! సంసారికి అటువంటి సదుపాయం తెలియదాయె. తన బరువు దింపుకొనే మార్గమే తనకు తెలియదు. అనగా ఉన్నంతకి తానే కర్తనని తలచక భగవంతునిపై భారముంచినచో తనకు శ్రమయుండదు గదా! అలాగే చింపగా వేపచేదు త్రాగేవాడు నడుమ నడుమ ఏదైనా తీపిని తినగోరుతాడు. అయ్యో! సంసారికి అలాటి తీపిని కల్గించేది గోచరింపక పోయెగదా! సాంసారిక వ్యవహారాలు ఎంతైనా చేసినప్పటికీ ఎక్కడ మాధుర్యం లేదు. తీపివంటిది భక్తి. దాన్ని సంసారి తిన గోరడు. సహింపరాని మాలిన్యాన్ని భరించేవాడు ఆదుర్గంధాన్ని పోగొట్టుకోవడానికి కొంతైనా పరిమళగంధాన్ని ఒడలికి పూసుకొంటాడు. సంసారికి అలాంటి బుద్ధి లేదే. చింతలలో మునిగి తేలునేగాని జీవుడు కొంతైనా ఏడుకొండలరాయని తలంచడు గదా! అనగా సంసారం దుర్భరమైన బరువు, భారాలు చేదు చింతలు, మలినాలు కొంతవరకైనా పోకార్చుకోవాలంటే ఏడుకొండలవాని దర్శనం తప్పనిసరి అని భావం.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇట్టె సంసారికేదియు | 42 | 26 | 11-2భా | 170 |

# 239

అ: శ్రీనివాసునిపై భక్తిమాని ఈ జీవుడు చెడుమార్గాలలో పడిపోతున్నాడని విచారిస్తున్నాడు

సీ. కొంటాలె నేరిచెఁ గాని యీ జీవుండు
  దిరమైననిజసుఖం బెఱుఁగఁ డాయె
కపురులే చవిగొనెఁ గాని యీజీవుఁ డ
  త్యంతసరసామృత మానఁడాయె
కొంపలనే తిరిగెను గాని యీ జీవుండు
  నరకము మొదలు చూచి నగువఁ డాయె
కొంపుకూటికిఁ బోయెఁగాని యీ జీవుండు
  చెడని జీతముపొంతఁ జేరఁ డాయె

ఆ. కరయఁ గనకపోయెఁ గాని యీ జీవుండు
గీనము వేంకటేశుఁ దెలియఁ డాయె,
ఏమొ తెలిసెఁ గాని యీజీవుఁ డొకింత
నేమపునెఱవిద్య నేర్వఁ డాయె

ఈ జీవుడు మోసాలే నేర్చినాడుగాని ఒకప్పుడైనా సత్యస్వరూపుడైన భగవంతుని గూర్చి ఆలోచించడు. సాంసారిక కల్లబొల్లిమాటలనే రుచిచూచాడుకాని భగవన్నామ మనే అమృతాన్ని రుచిచూడడాయె పైపైన తిరిగినాడేగాని తనపుట్టుక ఇప్పటి కర్మానుభవాన్ని గూర్చి ఆలోచించి ప్రవర్తించడు అనగా జననమరణాత్మకమైన సంసారం నుంచి తరించే మార్గంలో నడవడన్నమాట పొట్టకూటికై అలమటిస్తాడె కాని నాశం లేని బ్రహ్మముదగ్గరకు దాపు చేరడు అన్నీ తెలిసియు, భగవంతుని తెలిసికొన కున్నాడు వేంకటేశ్వరుని దర్శించకున్నాడు ఏమేమో తెలుసు ననుకొంటున్నాడు ఈ జీవుడు ఏ కొంచెం కూడా నియమంతోకూడిన ఆత్మవిద్యను అభ్యాసం చేయ డుగదా।

| కీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| ఏమో తెలిసె గాని | 20 | 123 | 1 | 84 |

## 240

అవ: జీవుడు ఈ భాగ్యాన్ని తెలిసికోలేడు కాని పరమసుఖం ఈ లోకంలోనే పొందవచ్చు అనుచున్నారు

సీ. దృష్టమియ్యది గాని తెలియఁగ జీవునకు
సులభ మిచ్చోటనే గలదు పరము
మనసునఁ దలఁచిన మర్మమ్ములు కరంగి
చొనుపుచు నింద్రియసుఖము నిచ్చు
ననువుగ నిటువలె హరి దలపోసినఁ
దనకు బ్రహ్మానంద మొనరుఁగ దె!
మాటలాడిన మెచ్చి మనుజు లిత్తురు పరా
త్పరు సంస్తవన మిష్టదాయి గాదె!

ఆ. చేతులారఁ దాను చేసినపుణ్యంబు
వెంటనంటి కాచు విధముగాను
వేసరక వృషాద్రివిభునకుఁ గావించు
సేవ పరమ సౌఖ్య సిద్ధిదంబు

జీవుడు తనవిధి నెఱిగితే ఇక్కడే పరమసుఖాన్ని పొందగలడు. మనసులో తలఁపు గలిగితే మర్మాలు ద్రవీభవించి క్షణికములైన ఇంద్రియసుఖాల నిస్తుంది. ఆ విధంగానే, తగినరీతిగా ఆ శ్రీహరిని తలపోస్తే జీవుడికి బ్రహ్మానందం కలుగునుగదా! పలకరిస్తే మానవులే కోరినవాని నిస్తారు, మరి ఆ పరాత్పరుని బాగా స్తోత్రం చేస్తే మనకోరికలన్నీ ఫలింపచేస్తాడుగదా! చేతులారా తను చేసుకొన్న పుణ్యం వెంటబడి కాపాడేవిధంగా, విసుగులేకుండా శ్రీవెంకటేశ్వరునికి చేసే సేవ పరమసౌఖ్యాన్ని సిద్ధింప జేస్తుంది

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| తెలియఁడుగాక | 352 | 7 | 11-1భా | 5 |

## 241

అవ: తిరుమలేశుడు కాపాడకపోతే శః జీవునికి జన్మలెత్తడం తప్ప మోక్షం పొందవలెననే బుద్ధిరాదు పుట్టదనుచున్నాడు

సీ. ఎక్కడి దురవస్థ? లేటి దేహము? లోనఁ
జిక్కి జీవుఁడు ముక్తిఁ జెందలేఁడు
ఒడలు మాంసపుముద్ద యొకపూఁటయిన మీఁదు
గడుగక కాలగాదు కంపుగొట్టు,
కడలేని మలమూత్రగర్తిత మిది లోనఁ
గడుగఁగఁ గా దెంత గడుగఁ బోదు,
అతిచంచలము చిత్త మనిలసమానమ్ము
నిలుపులేనిది పట్టి నిలుపరాదు,

గీ. తిరుమలప్ప నిత్యానందకరుఁడు జీవ
రక్షకుఁడ శుభలక్షణలక్షితుండు,
కరుణ నొకవేళఁ గాచినఁ గాక మేను
ఏ రకమానెడు బుద్ధియు సోఁకఁ బోదు.

ఎన్నో దుర్దశలుగల యేదో ఒక దేహంలో చిక్కుకొని జీవుడు ముక్తి చెందలేడున్నాడు. ఈ శరీరమా మాంసపుముద్ద. ఒకపూటైనా శుభ్రంచేసుకోకపోతే కంపుకొడుతుంటుంది. ఈ శరీరం అంతులేని మలమూత్రాలచే సేవగింపదగింది. అంతరంగికంగా శుభ్రంచేసుకోవడానికి వలనుపడదు. ఒకవేళ అంతరంగికంగా శుభ్రంచేసుకొన్నా అది తాత్కాలికమే. మరల మరల మలమూత్రాలు పుట్టుకొస్తుంటవి. మనస్సు అతిచపలమైనది. అది గాలితో సమానమైంది. నిలకడలేనిది. పట్టి నిలపడానికి సాధ్యంకానిది. నిత్యానందాన్నిచ్చేవాడు, జీవులను కాపాడేవాడు, మంచిలక్షణాలు గురుతులుగా గల తిరుమలేశుడు ఒకసమయంలో దయతో రక్షించితేతప్ప, జీవునికి శరీరంలో ప్రవేశించి (జన్మలెత్త) గూడదనే బుద్ధిరాదు కలుగదు. భగవంతుని కృప లేక మోక్షం అబ్బదని భావము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఎక్కడిదురవస్థలు | 17 | 106 | 1 | 78 |

# 242

భావ మనుష్యునిపాట్లు భగవంతుని లీలలే జీవి స్వతంత్రుడు కాడనుట [illegible]

సీ. ఎన్ని బాధలో తన కెన్ని లంపటములో!
తలపోత లెన్ని? వేదన లవెన్ని?
ఎన్ని తాపమ్ములో! ఎన్ని దుఃఖమ్ములో!
ఎన్నియుంచిన నెన్ని యైనీ కలవు
ఎన్ని కోర్కులో! తన కెన్ని మోహాలు? లను
సరణము లెన్ని? యాసలు మఱెన్ని?
ఎన్ని గర్వమ్ములో! యెన్ని దైన్యమ్ములో!
యెన్నికే దలపంగ నెన్నో కలవు.

గీ. పాదకొను హరిమాయచేఁ బరఁగు జీవుఁ
డెన్నిటికి నేగు? యెంచు నెన్నిఁటికని?
ఎన్నిటికి నేడ్చు? హర్షించు? నిన్ని వేంక
టేశులీలలే. తా నెంచ నేఁడు గాఁడు.

బాధలు, లంపటాలు, ఆలోచనలు, వేదనలు, తాపాలు, దుఃఖాలు లెక్కపెడితే ఎన్నో కలవు. కోరికలు, తనకుండే మోహాలు, అనుసరణలు, ఆశలు, అహంకారాలు, దైన్యములు ఎన్నెన్నో వున్నవి. పుట్టుకట్టిన వైష్ణవమాయవల్ల జీవుడు ఎన్నిటికి ఎదుగులాడును? ఎన్నిటిని కోరును? ఎన్నిటికి దుఃఖించును? ఎన్నిటికి సంతోష పడును? ఇవన్నీ ఆ శ్రీనివాసునిలీలలే.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సం౧ | పుట |
|---|---|---|---|---|
| ఏది తుద | 17 | 102 | 1 | 70 |

# 243

అవ. జీవి కామాంధుడై అవయవాలు మంచిచూపించటానికి సిద్ధంగా వుండే వాటిని పెడదారి పట్టిస్తున్నాడని మందలించుచున్నాడు.

సీ. మోహాన మాయావిమోహితుండై పాపి
కాసుసేయనిపని గాసిపడియె,
కను లనియెడి మహాకల్పభూజమ్ములు
తనుc బుణ్యుc జేయcగాc దగిలిరాcగ
ఉన్నతోన్నతబుద్ధి నుండక తనుధారి
కన్నచోటికిc బంపి గాసిపడియె,
చిత్తమనెడు మహాచింతామణి తనకు
తొత్తయి పనిసేయ తోడరాcగ
హరిమీcద హత్తించి యానంద మందక
తిత్తిసౌఖ్యమునకై తిరిగె జీవి,

ఆ. కామతత్త్వ మనెడి కామధేనువు కోర్కె
లొసcగc జాలియుండ, పొసcగ దీని
వేంకటేశుc జేరవేయక కామాంధుc
డగుచు గతివిహీనుc డయ్యె దేహి.

జీవుడు మాయచే అజ్ఞానియై కాసుమాలిన పనికై కష్టపడుతూంటాడు కనులనేవే కల్పవృక్షాలు అవి జీవుని పుణ్యవంతుని చేయడానికై తనతోనే ఉంటాయి వాటి సాయంతో భగవద్దర్శనం చేసుకుంటూ మహోన్నతబుద్ధితో మెలగక శరీరి ఆ కన్నులను కన్నతావులకేర్చి, వాటివల్ల పాపం సంపాదించుకొని కష్టాలపాలౌతాడు చిత్తమనేది కోర్కెలిచ్చే చింతామణి వంటిది. అట్టిది గులామై తనకు మంచిపనులు చేయడానికి తోడవస్తుండగా, అట్టి చిత్తాన్ని శ్రీహరిని చేర్చగా కలిగే ఆనందాన్ని అనుభవించక, కొంచెపుశరీరసౌఖ్యాలకు మళ్ళించి, జీవి తిరుగుతుంటాడు కామతత్త్వ మేరు ('కామః కామప్రదః ప్రభుః' అని శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రం అన్నింటిని మించిన కామం మోక్షం, అట్టిమోక్షస్వరూపుడు) కామధేనువు తనకు కోర్కెలొసగ జాలియుండగా, ఆ కామతత్త్వరూపుడైన వేంకటరాయునికి తనమేను సమర్పింపక మన్మథసంబంధంగా గుడ్డివాడై జీవుడు గతిమాలినవాడగును

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| మోహమున మాయా | 28 | 150 | 1 | 108 |

# 244

అవ: శ్రీవేంకటేశ్వరుని దర్శించక అంతంలేని ఈపుట్టువులను తప్పించుకొలేరను చున్నారు.

సీ. ఏది దీనికి కడ ? యేది మొదల్ పట్టి
వేదనల్ మఱి తన్ను వీడు టెపుడు ?
తొలఁకరిన హృదయమే తోడిదొంగ యగుచు
వడివడి తనుఁ బట్టి వలలఁ బెట్టఁ
గడఁగి తా కర్మముల్ గడచుట యెప్పుడు
నిటువంటి బంధముల్ విడుచు టెపుడు ?
తలిగొన్న తలఁపులే దైవ యోగమ్ముయి
మరగింపఁగా తన్ను, మనసుఁ జేరి

గీ. ఆపదలు వాయు టెపుడు ? నిజాశ తీఱు
టెప్పుడు ? మమతయె భూతమై యేచి బుద్ధి
కెదిరియు బోధింప, వేంకటాద్రీశుఁ గనుట
యెపుడు ? తుద లేని భవముల నీఁగు టెపుడు ?

ఈపుట్టువునకు అద్యంతాలు ఎక్కడ ఉన్నవి? లేవనుట. ఈజీవిని బాధలు వదలిపెట్టే దెప్పుడు? ఎప్పటికీ వదలవనుట. జీవుణ్ణి అనుసరించే హృదయమే తోడు దొంగై త్వరితంగా తన్ను (జీవుని)పట్టి బంధాలలో పెట్టగా, తానెంత ప్రయత్నించినా కర్మబంధాలను తప్పించుకొనే దెప్పుడు? అనగా మనస్సుయొక్క ప్రేరణచేతనే జీవుడు కర్మలాచరించి సంసారబద్ధుడౌతాడనుట. విస్తృతాలైన తలంపులే దైవయోగంగా మనసులో చేరి జీవుని వాటి తలపాయపడేట్టు చేస్తూంటే ఇక ఆపదలు పోయేదెప్పుడు? తనఆశ తీరేదెప్పుడు? ఆశ లున్నంతవరకు ఆపదలుంటాయని భావము. పైపెచ్చు తమ ఆశ ఎన్నటికి తీరవు. మమకారమే భూతంగా రెచ్చి బుద్ధి లేదో కొంచమాలిన దానిని ఉపదేశిస్తుంటే మరి శ్రీనివాసుని దర్శించే దెన్నడు? అంతంలేని జన్మపరంపరలను గడిచే దెప్పుడు? మంచిబుద్ధిగలవారే స్వామిని దర్శించి, అద్యంతరహితమైన ఈ సంసారాన్ని దాటగలుగునని భావము.

| పంక్తి రచన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఏది కడ దీని కేది మొదలు | 38 | 225 | 1 | 150 |

# 245

అవ శ్రీనివాసునిదయనే సంపత్తుగా దలచి జీవుడు హరిసాన్నిధ్య వైభవాన్ని అనుభవించే దెన్నటికో కదా అనుచున్నాడు

సీ. సతతమ్ము సంసారజడుఁడు గానట యాత్మ
హితము దెలియుకాల మెన్నఁ డింక ?
రతి సరసముల నూరకె ప్రాయ ముడుగంగ
నితర సౌఖ్యము తన కెన్నఁ డింక ?
నెపమున ద్రవ్యమోహితుఁడై తిరుగఁ దన
యిడుమపాటు దొలంగు టెన్నఁ డింక ?
కడలేని పొలయలుకలచేతఁ దన దేహ
మడియఁగ నిజసుఖ మెన్నఁ డింక ?

ఆ. శ్రీనివాసవిభుని జేరి తక్కిన సుఖ
మేవగించుకాల మెన్నఁ డింక ?
శ్రీకళత్రు కరుణ సిరిగాఁ దలఁచి జీవు
డీవిభవము గాంచు టెన్నఁ డింక ?

ఎప్పుడూ సంసారంలో పడి అజ్ఞానియైన తాను (జీవుడు) ఆత్మార్థాన్ని ఏకాలానికి తెలిసికోగలడు? సంసారంలో మునిగినవాడు ఆత్మజ్ఞాని కాలేడనుట. స్త్రీలతోడిసరస సల్లాపాలతో వ్యర్థంగా వయసు చెల్లిపోగా, ఇతరులకు సాధ్యంకాని బ్రహ్మానంద సౌఖ్యం తన కెన్న డబ్బుతుంది? అనగా రాగరంజితమనస్కులకు ఆత్మానందం అందదనుట. ఎడతెఱపిలేని ధనాశతో తిరుగుతుంటే ఇక తన కిడుమలరాదిదుఃఖాలు ఎన్నటికి తీరేది? ఆశాబద్ధులు సంసారాన్ని తరించలేరనుట. హద్దులేని ప్రణయ కలహాలతో శరీరం శుష్కించిపోతుండగా నిత్య(ఆత్మ)సుఖం తన కెన్నడు లభించును? చంచలాక్షులపై చాపల్యం గలవారికి ఆత్మానందం శశవిషాణతుల్య మనుట. శ్రీనివాసునిసన్నిధిలో చేరి ఐహికసుఖాలను ఏవగించుకొను టెన్నటికి? దేవునిదయనే సంపదగా దలంచి జీవుడు ఆ స్వామివైభవాన్ని తిలకించే భాగ్య మెన్నటికో కదా!

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కాయము జీవుడు గలనాఁడే | 88 | 352 | 1 | 295 |

# 246

అవ. తనుధనవిభవాలు చంచలములని, వృషాచలేశుని భక్తుడై ఉండమని ప్రబోధిస్తున్నాడు

సీ. దేహముల్ తలఁప సుస్థిరములా? ప్రాణుల
కూహింప లోభ మెల్లనాఁడుఁగాక
మోహమ్ముచే వెన్క ముందెఱుంగక తను
దేహసౌఖ్యముఁగోరి తిరుగుచుండ్రు,
నెలకొని ద్రవ్యముల్ నిలుచునా? యొరికి
నలవిమాలినయట్టి యాసగాక
బలువైన నట్టివిభ్రాంతికి లోనయి
తెలిసియుఁ దెలియక తిరుగుచుండ్రు,

గీ. విభవము లివన్ని నిజములా? వెర కెఱుంగ
లేక వగల వేఁగుచు నుండ్రుగాక- యెఱుక
గలిగి తిరువేంకటేశుని గొలువలేక
తెఱఁగు మాలిన బుద్ధితో తిరుగుచుండ్రు.

ఆలోచింపగా జీవులకు లోభం అంతగా ఉంది. ఈ దేహాలు సందేహంగదా! అజ్ఞానంచేత ముందు వెనుక (మంచిచెడ్డ)లు ఆలోచించకుండా శరీరసౌఖ్యాన్ని అపేక్షించి తిరుగుతుంటారు. హద్దుమీరిన ఆశగాక ఎవరికైనా సరే ధనం సుస్థిరంగా నిలిచి ఉంటుందా? ప్రబలమైన భ్రమకు చిక్కి అవకారజ్ఞానంతో సంచరిస్తుంటారు. వైభవాలు కలకాలం ఉండేవా? తరణోపాయం తెలియక కష్టాలతో మాడిపోతుంటారు. జ్ఞానంపొంది ఇందిరాసుందరుని పొందు పొంది సేవించుట మాని అపమార్గంలో పడిన బుద్ధితో అల్లాడిపోతుంటారు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుటి | పుట |
|---|---|---|---|---|
| సొరిదిసంసారంబు | 40 | 248 | 1 | 168 |

# 248

అవ - లోభం అన్ని అస్థిరాలకు మూలం, అజ్ఞాని దాన్ని విడువలే నన్నా డనుచున్నాడు

సీ. చదివెనుబో ప్రాణి సకలవిద్యలు మీఁది
　　చదువు రవ్వంతయుఁ జదువఁ డాయె
సిరులు చంచలమని చేతలస్థిరమని
　　బహుళసంసారమ్ము బయలు లటంచుఁ
దొరతెఱు సుఖమెల్ల దుఃఖమూలమ్మని
　　యెఱిఁగి లోభముమీఁద నెగ్గఁ డాయె
తలకొన్న ధర్మమే తలమీఁది మోపని
　　పెంచు కొల్లమి నైనవళి యటంచుఁ
గలిమియు లేమియుఁ గడవంగ రాదని
　　తెలిసి లోభముమీఁద దెలియఁ డాయె
గీ. పరహితమ్మెంతయును దన పాలి దంచు
వావులు నెవ్వగ లటంచు వరుస నిన్ని
శేషగిరిసార్వభౌముని చేత లంచుఁ
నాఁచి లోభంబు విడువంగఁ జూడఁ డాయె.

శరీరి అన్ని చదువులు చదువుకొన్నాడు. కాని అన్నిటికంటే పైచదువును కొంచెంకూడ చదువలేదు. అన్నిటికన్న పైచదువు భక్తి యని అభిప్రాయం. సంపదలు, పనులు(క్రియలు)అస్థిరాలని తామరతంపరగా వుండే యీసంసారం సాంతంలేని ఒట్టియాస్యమనీ ప్రాప్తించే సుఖాలే కష్టాలకు కారణమనీ, తెలిసియు, మానవుడు లోభం విడువలేకున్నాడు తలపెట్టిన ధర్మం, తలమీది మోపుమాదిరి బరువనీ అంతా దైవాధీనం అనీ వలదుట, ఒల్లకుండుట "కలిమిలేములు కావడికుండలు" అన్న సామెతగా, ఒకప్పుడుండి మరొకప్పుడు మాయమయ్యేవని తెలుసుకొనిగూడ ఆ లోభగుణాన్ని విడిచిపెట్టలేదు ఇతరుల మేలుగూర్చుట తనమేలుకొరకే యనీ, జిహ్వాచాపల్యము సంతాపహేతువనీ, ఇవన్నీ శేషాద్రినాథుని పనులనీ తెలిసియు లోభం వదలడానికి ప్రయత్నించకున్నాడు

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| చదివెఁ బో ప్రాణి | 65 | 339 | 1 | 228 |

## 251

అవ. శ్రమపడి ఏడుకొండలెక్కి శ్రీనివాసుని దర్శింపక దిగిరా కూడదని హితవు గఱపుచున్నాడు

సీ. కూఁడు వండుట గంజికొఱకా ? తనకు సౌఖ్య
మెట్టు గలదో వెదకుటకుఁ గాక
చదువునేర్చుట గద్దెకొఱకా ? మనసు మంచి
బాటఁ దిరియ నేర్వవలెఁ గాక
కొలువు చేయుట పొట్టకొఱకా ? కులీనుఁడై
మూఢాత్ముఁడై తన నిందమోయుకొఱక ?
జన్మమృత్యుజరాది సకలదుఃఖమ్ములఁ
దెగఁగోసి మే లెంచవలయుఁగాక

గీ. కొండ దర్శించుట చిట్టెల్లకొఱకె ? తాను
తిరిగి కొండెక్కు టారక దిగుట కొఱకె ?
కొండలప్పని యడుగులు గొలిచి తనకు
దగిలిన విపత్తులెల్ల నీఁగవలెఁ గాక!

అన్నం వండుట గంజికోసమా? కాదు, అన్నం కోసం తనకు ఆనందం ఎక్కడుందో దానిని తెలుసుకొనుటకు అనగా శ్రమించి కొండనెక్కడం, అన్నం వంటిదైన శ్రీవారిదర్శనం అనుభవించడానికే గాని గంజివంటి వినోదాలు అనుభవించడానికి కాదని భావం. అన్నం, గంజి రెండు ఉపయోగపడుతాయి గాని, అన్నం వంటి దేవదర్శనం ప్రధాన లక్ష్యంగా ఉండాలి. గంజి అనుషంగికంగా ఉండాలి. చదువు నేర్చేది జ్ఞానానికేగాని గద్దెకోసం గాదు మనస్సును మంచిదారిలో నడుపుటకు ప్రయత్నించవలెనే గాని కుమార్గాలలోనికి వెళ్ళనివ్వరాదు. కొండ ఎక్కడం చదువు నేర్చుటవంటిది కాగా, ధాన్యం వంటిది దేవదర్శనం, గద్దెవంటిది వినోదదర్శనం. ఉద్యోగం మానవులకు పనికి వచ్చేది, అది ప్రధానం పశుగ్రాసం గ్రాసం, అది అప్రధానం. ధాన్యమన్నదంచేదిపొట్టుకొఱకా? కాదు బియ్యంకొఱకే. మంచికులంలో పుట్టడం ఉన్నతనే నిందమోయడానికా? కాదు, జ్ఞాని అనిపించుకోడానికి. స్వామిసందర్శనం లేక కొండెక్కి దిగుట పొట్టువలె వట్టిదే అగును. దంచుట వంటిది కొండెక్కుట. శ్రీవారిదర్శనం ధాన్యసంపాదనంవంటిది. అదిలేక తిరిగిరావడం పొట్టువలె నిరర్థకం. పుట్టుక చావు ముసలితనం మొదలుగాగల అన్నివిధముల కష్టాలను బాగా ఆలోచించి, వీనిని తొలగించుకొని సౌఖ్యాన్ని పొందేమార్గం ఆలోచించవలె. చిట్టెలుకను బట్ట దానికా కొండనుత్రవ్వడం? కాదు. ఏదో గొప్పను పొందడానికే. అట్లే శ్రమపడి ఈ దేశి ధ్యానంతో ఏడుకొండలెక్కి పోవటం శ్రీనివాసుని దర్శించి సుఖించడానికిగాని చిట్టెలుకలాంటి చిట్టిపొట్టి ఫలాల తెచ్చుకోడానికి కాదన్నమాట. కనుక కొండలయ్య పాదాలకు మ్రొక్కి తన కేర్పడ్డ అన్నివిధాల కష్టాలను తొలగించుకోవలెను.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కూడు వండుట | 10 | 115 | 1 | 79 |

## 252

అవ జీవితం చదువులు- తరుణులు, వారిపొందు అస్థిరాలని, భక్తినే పట్టి సాధించవలసినదనీ తరణోపాయం చూపుతున్నాడు.

సీ. నాటక మింతయు నవ్వులకే పూట
పూటకుఁ బొల్లయిపోవు బ్రదుకు,
కోటివిద్యలు కూటికొఱకే యాఁకలి దీఱ
పాటుకు పాటెల్ల బయలయి చనుఁ,
తనుబంధనమునఁ జిక్కిన జీవి కేఁకట
మిలమిలలాడెడి చెలుల కొఱకె
అరమరపుల సుఖ మందిన పిమ్మట
మొఱఁగుకు మొఱఁగవో మొయిలయి చనుఁ,

గీ. అన్ని చదువులు శ్రీహరి నరయుకొఱకె
సార మెఱిఁగిన పరమసుజ్ఞానసిద్ధికి,
వేంకటేశ్వరు డెంకకు విశ్వపతి చను
మనసు భ్రమియింప వెన్నెలమాయ లెల్ల.

బ్రతుకంతా నవ్వు పుట్టించే నాటకం. ఇది పూటపూటకు వ్యర్థమై పోతుంది. 'కోటివిద్యలు కూటికొఱకే' అన్నట్లు ఆ ఆకలి తీరితే పడిన పడేపాట్లు వ్యర్థ మగును. శరీరమనే చెఱలో పడ్డ జీవికి తళుకుబెళుకులుగల తరుణులపై మిక్కిలి లపేతి పొటమరిస్తుంది. ఆ అల్పసుఖం పొందిన క్షణంలోనే అది మోసానికి మోసంగా మబ్బులా మటుమాయ మౌతుంది. సారం గ్రహించిన జ్ఞాని అన్ని చదువుల పరమార్థం శ్రీహరిని తెలుసుకొనడానికే అని తెలుసుకొంటాడు. మనస్సును భ్రమింపజేసే వెన్నెల వంటి ఆ మాయలన్నీ శ్రీనివాసునిదాసుని వదలిపోతవి. వైరాగ్యానికి భక్తి ప్రాణమని భావము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సం॥ | పుట |
|---|---|---|---|---|
| నాటకమింతా | 368 | 44 | 11-1భా | 30 |

# 253

అప. (కలి) కాలమహిమవల్ల మంచివన్నీ చెడుగా మారిపోతున్నవనీ వీటిని చక్క-బెయడానికి వేంకటపతియే దిక్కని అనుమన్నాడు

సీ. సన్మార్గముల కీలు సడలె కాలవిశేష
మేమొకో! సౌజన్య మేటఁ గలసె,
నేటి సంసారమో యిగిరె సద్ధర్మమ్ము,
శాంతమ్ము డిందె, విజ్ఞాన మణఁగె,
మలిన మాయె యెఱుక, మఱుగాయె వినుకులు;
యెందుకుఁ గానము మంచిపనులు,
సంతోషమునకు నెచ్చట చోటు లేదాయె,
సత్యమ్ము కొండలచాటుఁ జేరె,

గీ. తినుకు నెక్కడి బ్రదుకులు? తాఱుమాఱు
ఎకియె నాచారములు, జాతివర్ణధర్మ
సముదయమ్ములు తెగఁబడె, దిమిర మెల్లఁ
గావ వేంకటగిరి వివస్వంతుఁడె గతి.

కాలమహిమ ఎట్టిదోగాని, మంచిమార్గాలకు అయువుపట్లు తప్పినవి అంటే అవి నశించిన ఎన్నమాట మంచితనం ఏటిపాలైంది ఇది ఎక్కడి సంసారమో గాని దీనికై మంచిధర్మాలు ఇంకిపోయినవి శాంతి క్రిందైనది. విజ్ఞానం అణగారి పోయింది తెలివికి మాలిన్యం అంటింది విన్న మంచిమాటలు మరుగై పోయినవి సత్కర్మలు మందుకైనా ఎక్కడా అగపడవు. సంతోషానికి ఎక్కడా చోటు లేక పోయె సత్య మెక్కడో కోనలలో దాగింది. శిష్టులకు ఇక బ్రతు కెక్కడ? బ్రతుక ఏది తాత్పర్యము ఆచారాలన్నీ తారుమారైనవి జాతుల వర్ణాల వీటిధర్మాల పొట్లిపడుతున్నవి [illegible] (తమస్సును) వీటిని పోగొట్టడానికి ఆ వేంకటాద్రిపై వెలిగే వాడే (సూర్యుడే) దిక్కు

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కాలవిశేషమో | 10 | 63 | 1 | 42 |

# 254

భావం : సమత్వబుద్ధి గలవాఁడే సుఖవంతు డనుచున్నాడు.

సీ. తిట్టులు వచ్చిన దీవెన లొదవిన
 దట్టి సరిగ నెంచు నాతఁడె సుఖి
పట్టి చంపెడివేళఁ బట్ట మిచ్చెడివేళ
 నట్టిట్టు తొలఁకని యాతఁడె సుఖి
చేరి చక్కెర పెట్టి చేఁదుపెట్టిన రెంటి
 నారగించి తనియు నాతఁడె సుఖి
తేర కాంతరిపు మతి పోరానిచుట్టాల
 నచ్చుగ సరిఁజూచు నాతఁడె సుఖి

గీ. అనుసరించెడు పాపపుణ్యములవలన
వలము ఫలముల నొల్లని యాతఁడె సుఖి
సొరిది శ్రీవేంకటేశుదాసులను చేరి
అందరాని పదం బందు నాతఁడె సుఖి.

ఎవరు తమ్ము తిట్టినను, దీవించినను కోపహర్షములు లేక సమత్వబుద్ధితో నుండేవాఁడు, పట్టుకొని చంపే సమయంలో కాని, సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసేటప్పుడుగాని కోపహర్షాలు వెలిపుచ్చక స్థిరుడై ఉండువాడు, చెంతకుచేరి వంటవార మెక్కుమని ఇచ్చినా, చేదును తాగిన ఇచ్చినా ఆరెంటిని సమబుద్ధితో స్వీకరించి భుజించి తృప్తి చెందేవాడు, సంబంధంలేనివారినీ, దగ్గరిచుట్టాలనూ ఒకేవిధంగా చూడగలిగేవాడు, చేసే పుణ్యపాపకర్మలఫలాన్ని ఆశించనివాడు, ప్రీతితో తిరుమలయ్య దాసులను చేరి సేవించి తరించేవాడు సుఖవంతుడు.

| సంకీర్తన : | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| అటువంటివాఁడువో | 07 | 484 | 1 | 324 |

# 255

అవ భావమంటే జీవాత్మయని, అందులో అగుపించేవాడే దేవుడని తెలుపు చున్నారు.

సీ. ఏనుఁగుఁ దలఁచిన నేనుఁగై తానుండు
మ్రానయి తోఁచును మ్రానుఁ దలఁప
కొండను దలపోయ కొండయై కనఁబడు
స్వాంతగోచరుఁడు దైవమ్ము సుమ్ము,
బట్టబయలి నెంచ బయలదై కన్పట్టు
కడలియై కన్పట్టు కడలిఁ దలఁప
పట్టణమ్ము దలంప పట్నమై కనిపించు
భావగోచరుఁడు దైవతము సుమ్ము;

గీ. పన్నగనగమ్ము మీఁది శ్రీపతిని దలఁపఁ
బన్నగనగమ్ము మీఁది శ్రీపతిగఁ దోఁచు,
భావ మనఁగ జీవాత్మయే, దేవుఁ డనఁగ
రూఢిగాను మానసగోచరుండె సుమ్ము.

హృదయంలో ఏనుగును, చెట్టును, కొండను తలపోస్తుంటూ ఉంటే అవే అగుపిస్తాయి. ఇందుకు కారణం హృదయంలో గోచరించే సమస్తమూ దైవమే కనుక. బయలు తలిస్తే బయలు, సముద్రమును భావిస్తే సముద్రము, పట్టణమును స్మరిస్తే పట్టణం ప్రత్యక్షమవుతాయి. ఇవన్నీయూ భావ గోచరుడైన అద్వైతమే. అదేరీతిగా శేషాద్రిపై వేంచేసిన్న వానిని తలచితే అతడే గోచరిస్తాడు. భావజీవాత్మ అభిన్నములు. నిజంగా దేవుడు భావాన కానిపించేవాడు సుమా!

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| చూచే చూపొకటి | 184 | 141 | 2 | 86 |

# 256

అవ: జీవబ్రహ్మములు భిన్నములు కావనెడు ఇతరుల మతము నపహసించుచున్నాఁడు.

సీ. జీవుండె కొందఱు దేవుం డటండ్రుగా
  దైవమ్ము చేఁతలు తనకుఁ గలవె?
అవలఁ గొందఱు కర్మ మది బ్రహ్మ మందురు
  రావణాదులు దాన రాఁగఁ గనిరె?
దైవమే లేదని తగఁ గొంద ఱందురు
  తనుసృష్టియగా విశ్వభాతి యెల్ల?
గగన మాకారము నిరాకారుఁ డందురు గొంద
  తెగువఁ బురుషసూక్త మొలుఁగఁ జేసె?
గీ. కొంద ఱీతని నిర్గుణుఁ డందు
  రౌర! తక్కినయని తము వగున తలఁచ?
ఇవ్వి యేటిమాటలు! విన నింపె? వేంక
టేశ్వరుని దాసులై మనుటే హితంబు.

జీవుడే దేవుడని కొంద రంటారు. అట్లయితే దేవుడుచేసే పనులు తాము చేయగలరా? చేయలే రమట. కనుక జీవుడు దేవునికన్న భిన్నుడని అభిప్రాయము. అవతలం కొందరు కర్మమే బ్రహ్మ మనుచుందురు. అది అట్లయితే కర్మకులైన రావణాదులు ఆ కర్మలవల్ల ఎంతమాత్రం బాగుపడినారు? బాగుపడ లేదని భావము కాన కర్మము బ్రహ్మము కాదని నిర్ధారిత మైనదనుట. నాస్తికులు దేవుడే లే డంటారు. అయితే ఈ ప్రపంచమును సృష్టిచేసినది ఎవరైనా? కా దమట. సృష్టికి కర్త భగవంతుడని తెలియవలెను. మఱికొందరు ఆ దేవుడు ఆకాశం మాదిరి ఆకారం లేనివా డందురు. వీరికి పురుషసూక్తం తెలియదుకాబోలు. అందులో 'సహస్రశీర్షా పురుషః' అని భగవంతుడు సాకారుడుగా వర్ణితుడై యున్నాడుగదా. దేవునికి ఎనిమిదిగుణాలే ఉన్న వంటారు. ఆయన అనంతకల్యాణగుణుడు కదా! కొ అవగుణాలు వీరివా? ఆహా! ఇవేటిమాటలు? విన యింపగునా? ఇంత చర్చ యెందుకు? శ్రీవేంకటాచలపతిదాసులై బ్రతుకుటే సర్వోత్తమము.

| సంకీర్తన : | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఏటిమాటలివి | 112 | 67 | 2 | 45 |

# 257

అవ హరిభక్తి అనే కల్పవల్లి మెల్లమెల్లగా పెరిగి శ్రీనివాసుడనే ఫలాన్ని ప్రసాదించు నన్నారు.

సీ. వేదవేదాంతాల వెస మొలిచి కొనసాగి
గాదిలి హరిభక్తి కల్పలతిక
వైరాగ్యబోధల వసిఁ బోదిగాంచెను
చేరూని పంచసంస్కారములను;
మునులలోపల నల్లుకొనియె శాస్త్రపురాణ
ములయందు లలిదుటాకులను దొడిగెఁ;
సత్కర్మవిధులను సరవి పుష్పాలు పూచె
ఛాయల నించె సుజ్ఞానమునను,

గీ. అమృతు లనియెడు పందిటియందుఁ బరఁగెఁ
బరమయోగంబుల కలాటుపటలి నైచె,
శ్రీనివాసుఁ డిందుకు ఫలమైన వాఁడు
దొరకును వివేకులకు గురుచరణసేవ.

వేదములు ఉపనిషత్తులు అనువానిలో మొలకెత్తి ప్రియమైన హరిభక్తి అనే కల్పలత పెరుగసాగినది. వైరాగ్యం పెంపొందించే బోధలవల్ల అది గుబురైనది. పంచసంస్కారాలు అనగా శంఖచక్రముద్రాధారణము, ఊర్ధ్వపుండ్రధారణము, రామానుజ శ్రీనివాసదాసేత్యాదిగా దీక్షాకాలమున నామధారణము, 'ఓం నమో నారాయణాయ' అను తిరుమంత్రము; '<u>శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః</u>' అను ద్వయమంత్రము, తిరువారాధనము అనువానివలన ఆ భక్తి వల్లిక బాగుగా వేరూనినది. మునులహృదయాలలో అల్లుకొన్నది. శాస్త్రాలు పురాణాలు- వీటివల్ల చిగిర్చినది. కైంకర్యాదులవల్ల విరబూచినది. పండినజ్ఞానంచేత వన్నె మెఱిసినది. దేవతలనే పందిటిలో సొంపుగా పెంపు వహించినది. ఉత్తమమైన యోగములవల్ల (జ్ఞానధ్యానభక్త్యాదులు) పందెలు వేసింది. ఆ భక్తి వల్లరికి వరఫలం శ్రీనివాసుడే. ఆచార్యపాదసేవవల్ల జ్ఞానవంతులకీ ఫలం లభిస్తుంది.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| వంట వండుకొనేవారిభాగ్యము | 148 | 222 | 2 | 149 |

# 258

అవ : మానవుడు వేంకటేశ్వరభక్తుడైనగాని ఇంద్రియాదుల బారి దప్పగాదని తెలుపుతున్నారు.

సీ. జలధు లుప్పొంగు నైవడి నింద్రియమ్ములు
సందడించు నొకొక్క సమయమందు,
బడబాగ్ని రేఁగిన వడువున మున్కోప
ముడికించు మనసెల్ల నొక్క యెడను,
కొండ మోసినయట్టు లుండు సంసారమ్ము
కలిమిలేముల నొక్కకాలమందు,
కారుచీకటు లట్లు క్రమ్ము దుఃఖము లెల్ల
నూఱట లేకుండ నొక్క తఱిని,

తే. పెక్కుకోర్కులు పెనుగాలి వీచినట్టు
లూఁచు నిట్టట్టు లేచి యొక్కొక్కసారి,
అరయ వేంకటపతిదాసుఁ డయ్యుఁ గాని
యునికిఁ బాయ విన్నియును నే యొక్కవేళ.

ఒకానొకసమయంలో త్వక్చక్షుశ్శ్రోత్రాదివ్యాపారాలనే ఇంద్రియాలు సముద్రాలుఉప్పొంగినట్లుగా పెల్లుబికి కలవరపెడుతాయి. ఒకసమయంలో ముంగోపం బడబాగ్నివిధంగా చెలరేగి మనస్సును బాగా ఉడికించి వేస్తుంది. ఒకానొకతరుణంలో కలిమిలేములంచేత ఈ సంసారం కొండంతగురువై బరువై ఉంటుంది. ఒక్కొక్క సమయంలో కారుచీకట్లమాదిరి కష్టాలన్నీ ఒకేమారు ముట్టుముట్టి ఊరట లేకుండా చేస్తాయి. నానావిధాల కోరికలు తుపానుగాలిగా చెలరేగి ఇటూ అటూ ఊపుతుంటాయి. ఆలోచించగా ఏడుకొండలయ్యదాసుడైతే గాని ఈ కష్టాలు ఏ ఒక్కసమయంలోనూ వదలిపెట్టి పోవు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| అట్టివేళ | 98 | 489 | 1 | 328 |

## 259

భావ : భగవంతుని శరణుపొందినవానికి ఇహపరాలు అరచేతిలోని ఉసిరికకాయ లవుతున్నాయి.

సీ. దేహి పుట్టిన వేళఁ దెలియ నిరాకారి
గోచియు మొలత్రాడుగాను లేదు;
ఎదిరిని దన్నుఁ దా నెఱుఁగఁ డొక్కింతయుఁ
జెనకు కోరిక లేదు పేరు లేదు;
ఎదిగి విద్యావస్థ నెఱఁగు విరక్తుండు
సంసారభోగసంసక్తి గనఁడు,
ఏ పనులకుఁ జొరఁ డెట్టి లంపట లేక
పాపమ్ములే దీసుగూడ లేదు

గీ. హరిశరణుఁ డైనయపు దమరాధికుండు
వాని యరచేతియుసిరికల్ పరము నిహము;
దురితములు దుఃఖములు లేవు, పెరిగి పెరిగి
పెద్దయై మొద్దువలె నుంట బుద్ధిగాదు.

శిశువు పుట్టినపుడు ఏమియులేని నగ్నుడే. గోచి మొలత్రాడని కూడ అనుకోడు. ఇతరులమగాని తనమగాని కొంచెం కూడా తెలుసుకోవలేడు. ఆ దశలో పుట్టుకొనే కోరికగాని, పేరుగాని ఉండదు కొంచెం పెరిగి ఇతడే విద్యావస్థయంలో విరక్తుడై వుంటాడు. సంసారసంబంధమునైన సుఖాలను అనుభవించడు. ఏ పనులను పూనుకోనడు. కనుకనే అతనికి ఎట్టి గాసియు ఉండదు. అట్టివాడు శ్రీనివాసుని శరణుపొందితే అరచేతిలోని ఉసిరికాయలవలె అతనికి ఇహపరములు సులభ సాధ్యాలు అతడు దేవతలకంటె గొప్పవా డౌతాడు పాపాలు, కష్టాలు అట్టివాని కుండవు. కనుక వయసుమీరగా పెద్దయై మొద్దువలె స్వామిభక్తి లేకుండుట బుద్ధిగాదు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| పెరుగఁ బెరుగ | 89 | 440 | 1 | 206 |

## 260

భావ : శ్రీవేంకటేశ్వరుని సేవిస్తూ అందరు సుఖంగా ఉండవలెనని కోరుకున్నారు.

సీ. మారుతాత్మజు నమ్మి మనుజుఁ డంబుధి దాటి
నానార్థములు గూర్చి నటనసేయు
కంసారి కృపనమ్మి సంసారవారాశి
గొబ్బున దాఁటు లోకులకుఁ దగదె !
జాత్రె దినము నమ్మి సారిది నొక్కఁడు భూమిఁ
గట్టడి భయములు గడచుచుంత
నమ్మఁ జక్రాయుధు నిజనామమును నమ్మి
భవభయమ్ములు గడువంగఁ దగదె !

గీ. గాలి కాతెడు చిరుదీపకళిక నమ్మి
నరుఁడు వెంకటిం దాసి యరుస ముంద
జనులు తమ యాత్మ వేంకటస్వామి వెలుఁగ
మేల్మి నాతని సేవించి మెఱయ వలదె !

కత్తితో తయారైన తెప్పను నమ్మి మానవుడు మహాసముద్రం దాటి పలురకాలవస్తువుల సమకూర్చుకొని తైతక్కలాడుతుంటాడు. మరి కంసాంత కుని కరుణకు పాత్రులై లోకులు సంసారమనే సాగరమును తరించ దగదా ? తగు ననుట.

ఒకానొకడు ఇనుముతో చేసిన లాఠీతెరు ఆయుధం పట్టుకొని భూమిలోని భయాలను అవలీలగా తొలగదోసు కుంటాడు. ప్రీతితో చక్రం ఆయుధముగా కల శ్రీహరి నామస్మరణాన్ని నమ్ముకొని జననమరణభయాన్ని బాపుకో తగదా ? తగు ననుట గాలికి ఆరిపోయే గోరంతదీపసహాయంతో మానవుడు కారుచీకటిని పటా పంచలు చేసి సంతసిల్లుచుండగా మానవులు తమ ఆత్మలో ఏడుకొండలరాయుని జాజ్వల్యమానంగా వెలుగుతుంటే ఆ స్వామిని సేవించి తరించ వలదా ? తరించ వలె ననుట.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| వివేక మెఱుఁగని | 88 | 428 | 1 | 287 |

# 261

భావ : అంతరాత్మగా ఉండే శేషాద్రిప్రభుని తలంచనివారు జన్మమృత్యుజరాది
 దుఃఖ మనుభవింతు రనుచున్నారు

సీ. ఆఁకటి కడుగని యుర్విలో జననియే
 పట్టి పాల్పడించుఁ బట్టు లేక
రేఁడు రక్షకుఁడు కోర్కు లడిగిన యోగికి,
 బుద్ధి తొలఁగిన బోట్లఁగూర్చి
తలఁపదు గద తల్లి; దైవమ్ము స్వప్రియ
 త్నపరుల దాఁచ వత్సలత విడుచుఁ
స్వాతంత్ర్య మడిగిన వారొటఁ బొందాలిఁ
 గరిఁ గాచెఁ రాఁజాచెఁ గాదె బ్రహ్మ
తలద్రింగి నపుడు, మదనుఁడు మాడినపుడు
 వారలు స్వాతంత్ర్యపరులు గాన;
అనిశమ్ము దిక్కని యాత్మలోపలఁ దన్ను
 భావించునట్టి ప్రపన్న జనుల
గీ. ఇక్క దక్కఁగ రక్షించు నీ వృషాద్రి
 విభుఁ, డహంకార మించుక వీడ కంత
 రాత్మ మఱచిన ద్రోహులు ననుభవింత్రు
 జన్మమృత్యుజరాది విషాదములను.

పసిపాప పాలిమ్మని అడుగకున్నా తల్లి తనంతట తానే బలాత్కారంగా పాలిస్తుంది. అట్లే భగవంతుడు కోరుకుంటేని యోగికి అవసరమైన కోరిక తీస్తూ కాపాడుతాడు. బుద్ధి తొలగిన విద్యవిషయంలో తల్లి పైకితగా ఉండదుగదా! అవిధంగానే ప్రవంచూత శరణాగతి పొందక స్వప్రయత్నపరులైన వారిపట్ల ఉపేక్షభావంతోనే ఉంటాడు. ఇందుకు ఉదాహరణం ద్రౌపది, గజరాజు; తమ ప్రయత్నాలు వ్యర్థమై శరణాగతి పొందగా వారిని దేవుడు రక్షించాడు. అట్లుగాక స్వతంత్రంగా వ్యవహరించిన బ్రహ్మతల తునుమ బడినప్పుడూ, మన్మథుని శరీరం భస్మమైయినప్పుడూ భగవంతుని రక్షణ వారికి లేకపోయినది. ఎల్లప్పుడు నీవే దిక్కని ఆత్మలో తలపోసి ప్రపత్తి నొందే ఎక్కడెక్కడి భక్తుల నైనను ఈ వృషభాద్రి వాసుడైన శ్రీనివాసుడు కాపాడుతాడు. అహంకారం విన్నికొంచెమైనను వదలక అంతరాత్ముడై యుండే వేంకటేశుని తలచని ద్రోహులు చావుపుట్టుకలు, ముసలితనం ముస్నగు కష్టాలపాలవుతారు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇటుగన సకలోపాయములు | 31 | 301 | 1 | 282 |

# 262

అవ : వేంకటాచలపతికి దాసుడైనవాడు ఏ కులస్థుడైనా, ఎవరైనా పూజ్యుడే అనుచున్నారు.

సీ. జగతిలోపల సత్యసంపన్నుఁ డగువాఁడు
పరనిందసేయఁ బాల్పడని వాఁడు
అరుదైన భూతదయానిధి యగు వాఁడు
యితరులఁ దన వలె నెంచువాఁడు
నిర్మలుఁడై యాత్మ నియతి గల్గినవాఁడు
ధర్మతత్పరబుద్ధి దగులువాఁడు
కర్మమార్గమ్ములు గడవకుండెడు వాఁడు
తుది హరిభక్తి దేమఱని వాఁడు

గీ. ఎల్లరకు హితవుగఁ జరియించువాఁడు
పగ తలంపునఁ గొనకుండ బ్రదుకువాఁడు
ఏ కులజుఁడైన నెవఁడైన నేమి? వేంక
టాద్రిసమ్రాట్టునకు దాసుఁ డయినవాఁడు.

లోకంలో సత్యసంపన్నుడైనవాడే ఇతరులను నిందించుటకు పాలుపడడు. భూతదయకు నిధిగా ఉండేవాడే ఇతరులను తనవలె తలచగలడు. పరిశుద్ధుడై ఆత్మనియమనము కలిగినట్టివాడే ధర్మమందు ఆసక్తమైన బుద్ధికలవాడై ఉంటాడు. కర్మమార్గాలలో తగులుకొనని వాడే మనములో విష్ణుభక్తిని మఱువనివాడు. సకలజనులకు హితంగా నడుచుకొనేవాడే విరోధమును తలంపునకు రానీక బ్రతికేవాడు. పైగుణాలుగల శ్రీనివాసభక్తుడు ఎవరైనా, ఏకులంవాడైనా పూజ్యుడే.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుటి | పుట |
|---|---|---|---|---|
| ఏకులజుఁడేమి | 47 | 203 | 1 | 195 |

# 263

అవ. శరణాగతుడై ధన్యుడు కావడానికి మున్ముందు అలవరచుకోవలసిన అర్హతలను వివరిస్తున్నారు.

సీ. సతతదయాచారసంపన్నుఁడై కదా
 అమలవైష్ణవులకు నర్హుఁ డగుట
ఒనరంగ తీర్థయాత్రోపవాసమ్ములు
 తగ సల్పగద విష్ణుదాసుఁ డగుట
సకలయజ్ఞఫలమ్ము సమకూడినం గదా
 హరినామపాఠకుం డగుట తాను
అజన్మ శుద్ధుఁడై యలరారినం గదా
 అసమచక్రాంకితుం డగుట తాను

గీ. కలిగినం గద యాచార్యకరుణ తనకు
నంజనాచలవిభుఁ గనులారఁ గనుట
భక్తి ముదిరినఁ గద అన్యభావ ముడిగి
తాను శరణాగతుం డౌట! ధన్యుఁ డౌట!

ఎడతెగని దయ, ఆచారము బాగా కలిగినవారైతే ప్రశస్తమైన వైష్ణవమతానికి సమ్మతు లవుతారు. ఒప్పిదముగా తీర్థయాత్రలు, వ్రతాలు, ఉపవాసాలు చక్కగా చేస్తేగదా విష్ణువునకు దాసు డౌతాడు; సకలయాగాలు ఫలించినప్పుడే భగవన్నామసంకీర్తనం చేయ గలుగుతాడు. పుట్టినదిమొదలు పరిశుద్ధు డయితేనే చక్రాంకనములు ధరిస్తాడు. గురువుగారిదయను పొందగలిగి నప్పుడే, ఆ అంజనాద్రి విభుని కనులార కాంచగలుగుతాడు. భక్తి బాగా బలిసినప్పుడేగదా ఇతరచింతను మాని శరణాగతు డవుతాడు. ధన్యుడు కూడా అవుతాడు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుటి | పుట |
|---|---|---|---|---|
| సులభమా యిందరికి | 87 | 428 | 1 | 283 |

# 264

అవ : పరమభాగవతులు అన్నిలోకాలలో స్వైరంగా విహారంచేయగల రనుచున్నారు.

సీ. ఆకాశ మడ్డమా! అవలిది యడ్డమా
 శ్రీకాంతు భజియించు సేవకులకు!
పాతాళ మడ్డమా భాగవతాళికి!
 భూతల మడ్డమా పుణ్యులకును!
హరిదాసులకు నడ్డమా అమరావతి!
 తిమిరము లడ్డమా దివ్యులకును!
కమలసంభవుని లోకం బడ్డమా విష్ణు
 కైంకర్యపరులైన ఘనమతులకు!

గీ. పరమపద మడ్డమా! శేషపర్వతాధి
పతికి సూటిగ మొనరించు భక్తకోటి,
కన్ని లోకాల భోగించి యిచ్చ వెంట
వరుసగ విహార మొనరించు వైష్ణవులకు!

రమాపతిని సేవించే సేవకులకు ఆకాశంగాని, దానికి ఆవలిభాగం గాని అడ్డం కాజాలదు. భాగవతులకు పాతాళం అడ్డంకాదు. పుణ్యవంతులకు భూమి అడ్డం కాదు. హరిదాసులకు అమరావతికూడ చొరరానిది కాదు. భక్తిలో జానిల్లే దివ్యమూర్తులకు ఎక్కడగాని అజ్ఞానం అనే చీకటి అడ్డం కాదు. విష్ణుకైంకర్యంచేసే గొప్ప బుద్ధిగలవారికి బ్రహ్మలోకం కూడా సులభంగా చేరగలిగిన దావే. శేషపర్వతాధిపతికి పరిచర్యలాచేసే భక్తబృందానికి పరమపదంకూడ అడ్డం కాదు. అనగా సులభగమ్యమనుట. అన్నిచోట్ల భాగవతులు స్వైరంగా విహారం సల్పగల రని భావం.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఆకాశ మడ్డమా | 17 | 288 | 1 | 182 |

# 265

ఉ॥ వైరాగ్యం పొందడానికి ఏం లదగ్గసేవో తెలిపిస్తున్నాడు

సీ. కనులయెదుట నున్న కనకమ్ముపైఁ గాంక్ష
గలయంత తడవు మోక్షమ్ము లేదు,
అన్నాదివస్తులపై నభిరుచి గలదాఁక
పన్నుగ జ్ఞానమ్ము పదిలపడదు,
కాంతలపై భ్రమ గలయంత కాలమ్ము
మిక్కిలి హరిభక్తి మెఱయఁబోదు,
సంసారపున్విధి జరుగునంత తడవు
ధర్మమ్మునకు స్థిరత్వము గలుగదు,

గీ. చిత్తమునఁ జింతలెల్ల నశించుదనుక
పొత్తుకొనదు వైరాగ్యమ్ము, హరికటాక్ష
పాత్రులగు దాసజనులకు పరమమైన
శ్రీవిభుంరపదమ్ము లఱచేతఁ గలదు.

...దే కాంచనంపై కాంక్ష నశించనంతవరకు మోక్షం అబ్బదు. వంటలొలపై ఆశ ఉన్నంతవరకు జ్ఞానము స్థిరపడదు. స్త్రీలపై వ్యామోహ మున్నందాక వైష్ణవభక్తి సరిగా ప్రకాశింపదు. సాంసారిక కృత్యాలు జరుపుతున్నంతకాలం ధర్మానికి స్థిరత్వము కలుగదు. మనస్సునందు సకలవిధచింతలు నశింప కున్నచో వైరాగ్యం అంటదు. శ్రీనివాసుని కటాక్ష వీక్షణాలకు లక్ష్యమైన దాసలోకానికి వైకుంఠలోకం అఱచేతనే ఉంటుంది. అట్టివారికి వైకుంఠపదం సులభమని భావము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| తెగిం ఎవెమునకు | 285 | 203 | 3 | 188 |

# 266

అవ. జీవుడు మాయామోహితుడై కర్మబంధితుఁ డగుచున్నాడని, జ్ఞానియై శ్రీవేంకటేశ్వరుని కొలిచి తరించవలెగదా అని హెచ్చరించుచున్నాడు

సీ. ఏటివిచార మిదెక్కడి యాచార
మకట ! జీవుఁడు మాయలందుఁ బొరలు,
పరఁగ నూరేండ్ల బ్రదుకునకే గదా
తా నన్నియుంగూర్చి దాచుకొనుట
భువిని నానాసుఖభోగాలు చింతించు
పరమున కీపాటి పాటుపడఁడు,
కామసౌఖ్యమునకు కడుపు నించుటకేగా
యెగసగ నుద్యోగముల్ తొడుకుచుండు;
మిడిసి లోకములెల్ల మెప్పించ నతఁడును
హరిని మెప్పింపఁ బ్రియపడఁడు,

గీ. చచ్చి చచ్చి జన్మము లెత్తు జాలియెల్ల
నూరఁగల కర్మములను జేయుటకుఁ గాదె !
మెచ్చుగాఁ గొల్చు నరులను మేర లేక;
కూర్మి శ్రీవేంకటేశుని గొలువ లేఁడు.

జీవుడు మాయలో పడి పొర్లాడుచున్నాడు అయ్యో! ఇదేమి విచారము! ఇదెక్కడి ఆచారము! తా నన్నివస్తువులు సమకూర్చుకొని దాచుకొనుట ఈ నూరేండ్లబ్రతుకునకేగదా! పురుషాయువు నూరుసంవత్సరాలని ప్రమాణము అశాశ్వతమైన జీవితానికై వస్తుసంగ్రహణ మనుచిత మనుట భూమిలో పలు సుఖాలను భోగాలనుగూర్చ ఆలోచించునేగాని పరానికై ఈమాత్రంకూడ పాటు పడడు ఇంకా ఈ జీవుడు కామసౌఖ్యానికి, పొట్టనింపుకోడానికి పదలక ప్రయత్నములు చేయును, ఎగిరెగిరి జనమును మెప్పింప యత్నించునుకాని నారాయణమూర్తిని మెప్పించడానికి శ్రమించడు చావుపుట్టుకలు కల్గిన ఈ జన్మకష్టమంతయు దారిని పొయ్యే కర్మములు తన నెత్తిపై పెట్టుకొనుటయేగదా! వద్దువద్దులేక మెప్పుగా మానవులను సేవించునే గాని ప్రేమతో శ్రీవేంకటేశ్వరుని సేవించజాలడు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఏటి విచారము | 257 | 580 | 3 | 378 |

# 268

అవ చెడుదారిలోనడువక మోక్షమార్గమునను సరింపుమని జీవునికి బుద్ధిగఱపుచున్నాడు.

సీ. కటకట! జీవుడా! కాలవశుండవై
నటనటలను పొద్దు జరుపుచుందు,
సమరతి నన్నియుఁ జదివి తుట్టతుదకు
కుమతివై యొల్లరఁ గొలుచుచుందు,
తిరిగాని గంగకు తాన మాడఁగఁ బోయి
తగ నూతినీళ్ళను దాగుచుందు,
తనువు, ప్రాయము నమ్మి దానధర్మాల్ మాని
చెనఁటివై కర్మముల్ సేయుచుందు,
ఒనరంగ కొండనొగ్గిన మబ్బులను నమ్మి
దొనలనీళ్ళను వెళ్ళఁద్రోయుచుందు,

గీ. ఎలమి తిరువేంకటేశ్వరుఁ దెలియలేక
పాలమురాజుల వెంబడిఁ బోవుచుందు,
చిలుకకుంబలె బుద్ధులు సెప్పి యేమి?
బలుమరున కెల్లవుడు పాటఁ బాడుచుందు

అయ్యయ్యో! జీవుడ! కాలమునకు అధీనుడవై పనికిమాలిన పనులతో కాలం గడుపుతున్నావు. పరిపూర్ణముగ అన్నిచదువులు (ఆస్తిక్యబుద్ధ్యుత్పాదకములు) నేర్చి దుష్టబుద్ధివై పరమాత్మను విడిచి అనామకులనుగూడ కొలుచుచున్నావు ఆశతో గంగలో మునుగనెంచి దరి దరిసియూ ప్రక్కనున్న బావినీటిని త్రాగుచున్నావు అనగా గంగవలె పవిత్రమూర్తి శ్రీనివాసుని సేవింపగోరి చెంతకు జేరియు, చేరువనే గల సామాన్యదేవతల కొల్చుచున్నావనుట. ఈ శరీరము, ఈ వయస్సు శాశ్వత మనుకొని దానధర్మాలు చేయక మూర్ఖుడవై పాపపుపనులు చేయుదువు. ఆకాశము లోని మబ్బును చూచి కొండమీదినీటిపల్లములోని నీళ్ళను వెలికి పారజల్లుచున్నావు అనగా కలియుగప్రత్యక్షదైవమై శ్రీనివాసు డుండగా ఎక్కడో వుండే ఏ దేవుడో ఏదో గొప్పఫల మిచ్చునని ఆశించి నశించుచున్నావనుట. అఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుడైన వేంకటాధిపతిని తెలియలేక భూస్వాములవెంటబడుచున్నావు అనగా అఖండానందమును కాదని అల్పసుఖాన్ని కోరుతున్నావనుట. చిలుకకు ఎన్నిబుద్ధులు చెప్పినను ఏమి ప్రయోజనము? అనగా అది నేర్చినపదములను తిరిగి పల్కించునే గాని వానియర్థ మెఱిగి ప్రవర్తింపదుగదా! అటులే మానవుడు ఎంత నేర్చినను ఆచరణ లేకున్నచో నిరుపయోగ మనుట. ఓయీ! కామాతురుడవై ఎల్లప్పుడు మన్మథునికి వంతపాట పాడుచునేయుందువు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కటకట జీవుడా! | 87 | 350 | 1 | 284 |

# 269

అవ : భగవన్నామము తఱుగని ధనమని, దానిమహిమను వర్ణించుచున్నాడు.

సీ. ఇచ్చలోఁ గోరిన వెల్లఁ దీర్చు ధనమ్ము
గోవిందునామమే గొప్పధనము,
నారదాదులజిహ్వ నర్తించెడు ధనమ్ము
సకలాగమమ్ములు చాటు ధనము,
కూర్మి మౌనులు దాచుకొనెడు ధనమ్ము మో
క్షానకు సంబళమైన ధనము,
ఇరవైన భక్తుల కెల్ల నింటిధనమ్ము
తిరముగా నాత్మఁ బాతిన ధనమ్ము,

గీ. పరమశివుఁడు కాశీపురిఁ బంచు ధనము
పూజ్యులైన యాచార్యుల మూలధనము,
మించి వేంకటవిభుఁడు పాలించు ధనము
అరయ హరినామమే నిత్యమైన ధనము.

గోవిందుని తిరునామము చాల గొప్పది. మనసులోని కోరికలెల్ల తీర్చగల్గినది. ధనమున్నచో అన్నిటిని పొందవచ్చును. 'ధనమూల మిదం జగ' త్తనిపెద్దలమాట. ఈ హరినామధనమే నారదుడు మున్నగా గల పరమర్షుల జిహ్వాగ్రములో నాట్యం చేయుచుండెడిది. ఈ ధనమహిమనే అన్ని వేదశాస్త్రాలు చాటిచెప్పునది. మునులు ప్రీతితో దాచుకొనేది ఈ నామధనమునే. మోక్షమార్గాన పయనించేవారికి ఈ ధనం దారిబత్తెమైనది. మంచిభక్తుల కెల్లరకు ఇంటనుండే ధనమీ భగవన్నామమే. ఇదే ఆత్మలో స్థిరముగా పూడ్చిపెట్టిన ధనము. పరమేశ్వరుడు కాశీపట్టణములో అందరికి ఈ నామధనమునే పంచిపెట్టుచుండును. అనగా ముముక్షువుల కుడిచెవిలో పరమేశ్వరుడు రామమంత్రాన్ని ఉపదేశించును. పూజ్యులైన ఆచార్యుల మూలధనం భగవన్నామమే. అతిశయముగా వేంకటాద్రినాథుడు రక్షించేది ఈ నామమునే. ఆలోచించగా తఱుగనిధనం హరినామమొక్కటే.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇచ్చలోఁ గోరేవల్లా | 205 | 27 | 8 | 19 |

# 270

ఆవ: వేంకటేశ్వరునికృప కలిగినప్పుడు సకలదోషములు నశించి నరుడు ముక్తిని పొందు ననుచున్నాడు

సీ. దైవము కృపయున్న తనకర్మ మడ్డమా?
ఆ వేళ ఘనపుణ్యుఁ డగును గాక
గోవిందుఁ డొప్పిన కొంచెము దొడ్డమి?
కొనకెక్కుఁ గాక మిక్కుటపుసిరుల?
పరమాత్ముఁ డేలిన బంధముల్ గలుగునా?
తెరదీసినట్లుగ తెగును గాక
శ్రీశుండు విజ్ఞాన మిచ్చ నడ్డముండునా?
పొరలిన మాయలు దొలఁగుఁ గాక

గీ. చిత్తమున శ్రీనివాసుండు చిక్కె నపుడు
చావుపుట్టువు లున్నవా జయమె గాక,
కడమ లున్నవె కైవల్య మిడఁగ నితఁడు
మించి జగమెల్ల నిల్లె గెల్పించుఁ గాక!

దైవకృప కలుగగా తన పాపకర్మ లడ్డపడవు దైవకృప కలిగినవాడు గొప్ప పుణ్యాత్ముడే అగునుగదా। గోవిందునిదయ ఉండగా కొద్దిగొప్పలతేడా లేక అతిశయమైన సిరులు ప్రియంబు లందుకొనునుగదా। ఆ పరమాత్మ రక్షకుడు కాగా మరి తగులము లెక్కడివి? అవి తెరతీసినట్లు జారిపోవునుగదా। ఆ లక్ష్మీపతియే విజ్ఞానము అనుగ్రహింపగా ఇక అడ్డేమిటి? పైకొన్న మాయలు పటుమాయ మగునుగదా। శ్రీనివాసుడు మనసులో గోచరింపగా మరి చావుపుట్టువు లెక్కడివి? అంతటా జయమేగదా। ఈ శ్రీశుడు మోక్ష మొసగగా కొఱవ లేమి? లోకమునే అతడు జయింప జేయ గల్గును.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| నేమెంతమూఢులమైనా | 423 | 285 | 3 | 285 |

# 271

అవ  జీవుడు ఐహికభోగాలతో విసిగి వేసారి కడకు వృషాద్రినాథుని సేవించి తరించునని అనుభవపూర్వకముగా నుడువుచున్నాడు

సీ.  ఎన్నినాళ్ళులకేని యీ యర్థమే కల
        దింతేగానని వారి నెఱుఁగవలయు
ఎంత నూతేఁడులకేని చావు నిజమ్ము
        ముంచి యిట్టే మోయు మురికిఁదొక్కు,
ఇందుకుగా సుఖమేమిఁ గోరెదమొ ? యె
        వ్వరికై గడింతుమో సైఁడిముద్ద,
కలిగినదినములు కాఁపురానకె సెల,
        దాసకు లేదాయె హద్దు పద్దు,
ఫలమేమిగల దిందు? ప్రాణి యేమిటివాఁడో
        తీరని దీచిక్కు తెలిసి చావ,

గీ.  ఇంద్రియమ్ముల రసమాయె నెల్లప్రొద్దు
మొనసి చేసినకర్మముల్ మోపులాయె,
ఇన్నిటికి వేసరి వృషాచలేంద్రుఁ గొలువ
మాసినదె మదుగాయె, జన్మములు తొలఁగె.

ఆలోచింపగా నూరేండ్లకైనను మరణం తప్పదు ఈ మురికి దేహాన్ని అందాకా ఈ జీవుడు మోయుచుండును. ఇంతభాగ్యానికి ఎందులకు సుఖాన్ని కోరుదుమో? మనం సంపాదించే బంగారం (ధనం) ఎవరికొనమోగదా। మరణానంతరం అనసొమ్మంతా పరులపాలవి కావం బ్రతికిన దినాలన్నీ కుటుంబపోషణకే సరిపోయినవి అశకు హద్దుపద్దులు లేవుగదా। పైకార్యాలలో ఫలమేమున్నది? ప్రాణి ఏపాటివాడు? అనే చిక్కుసమస్య ఏనాటికీ తీరునది కాదు. దీని నెఱిగి తోసి ప్రచ్ఛన్నాలను క్రమంగా ఇంద్రియాలపటుత్వం తగ్గిపోవును కర్మబంధములు పెను మోపు (అధికము) లగుచున్నవి. ఎంతకాలానికైనా ఈసమస్య ఇట్లే ఉండును చిక్కు వీడదు బ్రతికియుండగనే భక్తితో భగవంతుని తెలియవలెను పైవాని సేవ గించుకొని వేంకటేశ్వరుని కొలువగా హేయములైన పయి వన్నియు పూతములై జన్మరాహిత్యము కలుగును

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఎంతకాలమునకైనా | 216 | 88 | 8 | 68 |

# 272

అన హరినామసంకీర్తనమే జీవనముగా గలిగి పలువురు తరించిరని పలుకు చున్నాడు

సీ. చాలదా హరినామసంకీర్తనం గల
మేలు దీనన బుధుల్ మెఱసినారు,
వేదశాస్త్రమ్ముల విన్నుల నెఱుంగక
ప్రాచేతసాగ్రణి పరమమునులు
సమకొని హరిమంత్రజపపరాయణు లౌచు
నఖిలలోకమ్ముల నధికు లైరి
ఇతరదైవతముల నించుక యెఱుగక
ప్రీతి లేనిమహిమ పర్వతతనూజ
హరిమంత్ర మొక్కండె యాత్మలోఁ దలఁచుచు
హరునిలో సగమయి యర్థి నిలిచె,

గీ. చదువ నోపక పలుమరు చదువు లెల్ల
నారదాదులు వేంకటనగవిహారి
యైన శ్రీహరినామమే యనవరతము
వదల కది జీవనం బయి వఱలినారు

హరినామసంకీర్తనములోగల మేలు ఒక్కటే చాలదా? చాలు ననుట. ఆ నామసంకీర్తనంతోనే పండితులు (దేవతలు) పెంపు గడించారు. వాల్మీకి మున్నగు పరమర్షు లెందరో వేదములయొక్కయు, శాస్త్రములయొక్కయు విధులను తెలియజాలక ప్రయత్నంతో హరినామజపంలో ఆసక్తులై అన్నిలోకాలలో అధికు లైరి. పార్వతీదేవి వేఱుదేవతలను అనుకొనక ఒక్క హరిమంత్రజపమువలననే ఈశ్వరుని సగంశరీరంలో నిలిచినది. పలుమారు వేదశాస్త్రాలు చదువలేక నారదుడు మున్నగు పరమభాగవతులు వేంకటగిరిపై విహరించే శ్రీహరినామమునే అనవరతం వదలిపెట్టక జపిస్తూ అదే జీవనంగా కల్గియున్నారు.

కనుక హరినామజపముకంటె అన్యతరణోపాయం లేదని తాత్పర్యము

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| చాలదా హరిసంకీర్తన | 33 | 205 | 1 | 136 |

# 274

అవ : మనసునకు కర్త మంగాప్రియుడు. అతనిని సేవించుటకు కర్త మానవుడని నిశ్చయించి పలుకుచున్నాడు

సీ. దురితమ్ములకు నెల్లఁ దొడవగు మమకార
　　　మరుదైన మమతల కాస తొడవు,
గురుతైన యాసకు గోరికల్ జీవన
　　　మింతకు లంపట హేతు వగును,
తుదలేని లంపట దుఃఖబీజము దుఃఖ
　　　ముదుటు తాపమ్మున కుండఁ జోటు,
పదిలమౌ తాపంబు ప్రాణసంకటమె యీ
　　　మదము పెంపున కెల్లఁ గుదురు మనసు,
గీ. మనసునకుఁ గర్త మంగాంబమగఁడు, వానిఁ
దలఁచుపని కెల్ల మనుజుఁడు తాను కర్త,
తలఁపు లివి దైవమానుషమ్ములుగఁ దెలిసి
నలినలోచను నాత్మేశుఁ దలఁప వలదె!

పాపములను ప్రోత్సహించునట్టిది మమకారము (నాది అను భావము) ఆ మమకారాన్ని పెంపొందించునది ఆశ కోరికలు ఆశకు జీవనమువంటివి. ఆ అన్నింటికి శ్రిష (లంపట) కారణము అంతులేని లంపట దుఃఖమునకు హేతువు ఆ దుఃఖము ఉద్ధతమైన తాపానికి స్థావరము నిలకడైన తాపము ప్రాణసంకటమును గల్గించును ఈ మదపుచేష్టలకు మనస్సు మూలము మనస్సునకు కర్త మంగాధిపతి, అనగా భగవంతునిపై లగ్నంచేయబడిన మనస్సు నిశ్చలంగా నిర్మలంగా నుండు ననుట మానవుడే తలంపులకు కర్త అనగా మనుజుని బుద్ధిలో ఏవేవో ఆలోచనలు పుట్టుచుండు ననుట ఆ తలంపులలో దైవసంబంధమునైన తలంపులను వృద్ధిపొందించుకొనుచు లౌకికములగు తలంపులను వదలుచు ఆత్మప్రభుని, తామరలఁబోలిన కన్నులుగల శ్రీవేంకటేశ్వరుని ధ్యానింప వలదా? ధ్యానింపవలె ననుట.

| సంకీర్తన : | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కడునడుసు పొరపేంల | 41 | 261 | 1 | 108 |

# 275

అవ : హరియు, ఆతనిశరణాగతియు కామనిధానములని చాటుచున్నాడు.

సీ. కలవు రెండే రెండు కామనిధానముల్
హరియు నాతనిశరణాగతియును,
నరులు లేరా ? భూమి నానాదిశలయందు
హరిదాసుఁ డొక్కఁడే యరుదుగాక!
సురలు లేరా మింట సోదించ ? ఘనుఁ డొకం
డల వికుంఠంబేలు నతఁడు గాక!
మాటలు మంత్రాలు మహిని లేవా ? విష్ణు
నామమే పరసాధనమ్ము గాక !
పూజలు సల్పెడివి లేవా ? కోటిపూజలు
తులదూఁచ భక్తియే దొడ్డగాక !
విశ్వమున లేవె భోగించ వేలసుఖము ?

గీ. లతులకైవల్యసుఖమె సౌఖ్యమ్ము గాక !
ఇహమునం దిందఱకు లేఁడె ? వృషగిరీంద్రుఁ
డవని వైష్ణవులకె మని కాయెఁ గాక !

ఐహిక పారలౌకిక కామములకు రెండే పెన్నిధులు. ఒకరు శ్రీనివాసుడు, రెండవది వారిశరణాగతి ఒక్క-హరిదాసుడుమాత్రమే అరుదుగా వుంటాడుకాని ఈ భూమిలో అన్నిదిక్కులలో మనుష్యులు లేరా ? ఉన్నను నిరుపయోగ మనుట. పైకుంఠమేలే విష్ణుదే గొప్పవాడుగాని వెదకితే స్వర్గములో దేవత లెందరో లేరా, ఉన్నను ఉపయోగం లేదనుట. విష్ణునామమే పరము సాధించునట్టిదిగాని, అందుకు గాని మాటలు మంత్రాలు ఎన్నో పుడమిపై లేవా, ఉన్నను దండుగనుట. తులదూచితే భక్తియే మెక్కుడుగాని మానవులుచేసే పూజలు కోట్లు లేవా ? ఉన్నను అవి భక్తికన్న మిన్న గావనుట. సాటిలేని సుఖమంటే మోక్షసుఖమేగాని ఈ లోకంలో అనుభవించుట కెన్నియో సుఖము లున్నవిగదా ! అవి క్షణికము లన్నమాట ఈ లోకంలో వృషాద్రినాథుడు సర్వజనులకుదైయున్నను విష్ణుభక్తులకే ఆతడు జీవనమై యున్నాడు

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కలవి రెండే భూమి | 272 | 412 | 3 | 277 |

# 276

అన తిరుమలప్పను పూజించనివాడు జ్ఞానహీనుడై మాయలో మునకలు వేయుచుండు ననుచున్నాడు

సీ. కడనుండు జ్ఞానికిఁ గా దిటువలెఁ దన
 మొదలిరోఁతలు చూచి యెరుక నవ్వు
పాముకా టందినవానికిఁ దినఁ జేవ
 వేఁపచేఁ దైనఁ జప్పిడిగఁ దోఁచు
సంసారవిషము శీర్షమున కెక్కినవాని
 కతిహీనకాంతయు నప్సరసయె,
కాఁడివానికిఁ దన వెకలిచేష్టలు తెలివి
 గలవానిపనులుగఁ దలఁపుఁ గూర్చు,
మొదలి కర్మపునామము మేయు సంసారికిఁ
 గర్మమే బ్రహ్మమై కానిపించు,
గీ. విశ్వ మొక్కటియే చవుల్ వేఱు వేఱు,
మఱపు కప్పిన తెలుకను, మాయలందుఁ
దేలియాడఁగ వలసెను దిరుమలేశు
నంఘ్రినీరేజములఁ గొల్వనట్టివాఁడు.

జ్ఞాని అజ్ఞానివలెగాక తనశరీరసంబంధములైన మూత్రపురీషాది జుగుప్సాకరములైన వాటివిజూచి నవ్వుకొనును. అనగా శరీరముయొక్క హేయభావమును తలపోయు ననుట పాముకాటుకు గురియైనవానికి వేపాకు దిన్నను అది చప్పిడిగా అనిపించును. అలాగే సంసారవిషం బాగా తలకెక్కినవానికి పరమనీచురాలైన స్త్రీకూడ అప్సరసగా అనిపించును. అదేమాదిరి వెఱ్ఱివాడు తనుచేసే పిచ్చిపనులు జ్ఞానిచేసే గొప్పకార్యాలుగా భావించును. పూర్వజన్మల కర్మఫలములనే బాముపైరు ననుభవించేవాడు కర్మమే బ్రహ్మ మని భావించును. ప్రపంచ మొక్కటే అయినప్పటికి లోకులఅభిరుచులు వేఱువేఱుగా నుండును. జ్ఞానమును విస్మృతి కప్పివేసినది. తిరుమలేశుని అడుగుదామరల నర్చింపనివాడు మాయలోబడి తట్టుమిట్టాడవలసియుండును.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| కడనుండే విజ్ఞానికి | 263 | 367 | 3 | 247 |

# 277

అవ. జగమే మాయ బ్రతుకే మాయ శాశ్వతమైనది వైకుంఠమే అని ఉపదేశించు చున్నాడు

సీ. కానక కన్నది కైవల్యపద మది
నానాటిబ్రదు కిది నాటకమ్ము,
పుట్టుటయు నిజమ్ము పోవుటయు నిజమ్ము
నట్టనడిమి పని నాటకమ్ము,
ఎట్టయెదుట గల దీప్రపంచ మ్మింక
కైవల్యపద మది కట్టకడది
కుడిచెడి దన్నంబు కోకచుట్టెడి దింక
నడుమంతరపుపని నాటకమ్ము
ఒడిగట్టుకొన్నట్టి యుభయకర్మమ్ముల
వదలదాక నపుడె కైవల్యపదము,

గీ. తెగదు పాపమ్ము పుణ్యమ్ము తీరిపోదు
నగుచు నడచెడి కాలమ్ము నాటకమ్ము,
ఏడుకొండలనాయకుం డేలు గగన
పథము మీదిది పరమకైవల్యపదము

ఆ మోక్షస్థానం లేకలేక దొరకునట్టిది నానాటగడిచే ఈ బ్రతుకే ఒకనాటకము చావుపుట్టుకలు నిజము. వీనినడుమ నడిచే పనియే నాటకము. కన్నులయెదుట కనిపించే ఈ ప్రపంచం నిజమని తోపింపజేస్తుంది ఎక్కడో అగోచరంగా వుండే కైవల్యమే జీవికి చరమస్థానము పొట్టకు పెట్టెడుకూడు, కట్టుటకు మూరెడుగుడ్డ- ఈ రెంటిసంపాదనకేగదా మానవుడాడే ఈ నాటకమంతా ? పుణ్యపాపకర్మల తెగకోసినపుడే కైవల్య మబ్బుట నిష్కామకర్మాచరణ మోక్షసాధన మనుట పాపముగాని, పుణ్యముగాని పూర్తిగా శూన్యము కానప్పుడే జీవి అనుభవించే కాలమే ఈ నాటకము ఏడుకొండలవిభుడు వేంకటేశ్వరుడు ఏలుగా, వియత్తలానికి పైనున్నట్టిదే పరమకైవల్యస్థానము.

దానికే యత్నించాలి.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| ఈనాటి బదుకు నాటకము | 200 | 576 | 3 | 387 |

## 278

అవ శ్రీజయంతిమహిమ నుగ్గడించుచున్నాడు.

సీ. శిష్టరక్షణమును దుష్టనిగ్రహమును
సృష్టించె నొకమారె శ్రీజయంతి
హరి కృష్ణమూర్తియై యవతరించినయంతి
పరమమునుల కెల్ల భయము లుడిగె,
అనుకూలగుండెలో నడలు గడల్కొనె
సిరులమించినయట్టి శ్రీజయంతి,
తగ శౌరి వసుదేవతనయుండై నప్పుడే
గోపులఅంకెలు గుబ్బతిల్లె,
మాయయా కంసరాణ్మణికి నూలును నింగి
చేవమీరినయట్టి శ్రీజయంతి,

గీ. అవనినారాయణుండగు నయ్యదైన తిథిని
మేనమామని పాండవుల్ మేలు గనిరి,
కౌరవులహని దీటె వేంకటవిభుండు
శేషగిరి చెల్వు గులుకంగ శ్రీజయంతి.

శ్రీజయంతి అనగా శ్రీకృష్ణజననము రోహిణీనక్షత్రయుక్తమైన శ్రావణబహుళ అష్టమినాడు జరిగినది అది ఒకే మారుగా శిష్టరక్షణమును, దుష్టశిక్షణమును చేసినది పైవానికొలకే శ్రీకృష్ణావతారమునకు

కృష్ణావతారమువల్ల మునిపుంగవుల కందఱకు దానవభయము తొలగెను. పరమశోభాయమానమైన శ్రీజయంతి రాక్షసులగుండెలలో హడలు పుట్టించినది. అనగా తమ్ము సంహరించునని యెంచి రసుల విష్ణువు వసుదేవపుత్రుడై యవతరింపగా గోపులు (తమకు రక్ష కర్తైనని) ఆనందముతో అంకెలు వైచిరి శ్రీకృష్ణావతారముతో కంసునికి మారేండ్లు నిండినవి అనగా అతనికి మరణము దాపైన దన్నట. శ్రీమన్నారాయణుడు పరుడుగా పుట్టగా మేనరికంతో పాండవులు మేలును, వారి శత్రువులైన కౌరవులు హానిని పొందిరి. ఆ కృష్ణుడే శ్రీ వేంకటేశ్వరుడై యిచట శేషాద్రిపై అందాలు చిందుతున్నాడు

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| శిష్టరక్షణమును | 245 | 258 | 3 | 174 |

# 280

భావ జీవేశ్వరులను చక్కగా తెలిసి శేషాచలపతిని కలనైన మఱవకుమని హితవు గఱపుచున్నాడు.

సీ. పుట్టినవానికి భువి మరణము తథ్య,
మట్టె చచ్చినవానికగును పుట్టు,
పోఁగానఁగా రాదు బొందిఁ బుట్టినవాఁడు,
కోసలేదు నడుమనే కొన్ని నాళ్ళు,
జీవుండు నిత్యుండు చెఱుపఁగరాని వాఁ,
డీ వివేకము పొంది యెల్లవారు
తమ ధర్మములఁ జేయఁ దగదు, దైవము నమ్మి
సంసారయోగమ్ము జరపవలయు,

గీ. చిత్తమా! హరి నీలోనఁ జెందియున్న
వాఁడు పాయకుమీ, దేహభావ బుద్ధి
జీవగుణ బుద్ధి యని చక్కఁ దెలిసి శేష
మహీధరాధీశుఁ గలనైన మఱవ వలదు.

'జాతస్య హి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్య చ' అన్నట్లు పుట్టినవాడు చచ్చుట, చచ్చినవాడు పుట్టుట విధము. ఈ చావుపుట్టువుల ఆద్యంతములు అంతుపట్టవు బ్రతుకన్నది జననమరణముల మధ్యకాలమున సాగే కొన్నాళ్ళ ముచ్చట జీవుడు నిత్యుడు నశింపజేయరాని వాడు అనే జ్ఞానమును పొంది అందరును దైవాయత్త చిత్తులై సంసారమును సాగించుకొనవలెను ఓ మనసా! శ్రీహరి నీలో నున్నాడు వారిని వదలకుము. జీవదేహభావముల భేదమును బెస్సగా గుర్తించి, శ్రీశేషాచలాధిపతిని స్వప్నమందైనను మఱవకుము.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇది యెఱుదనుకొండిది | 183 | 421 | 2 | 284 |

## 281

అవి దేవు డిచ్చిన దానితో తృప్తిపడడం మంచి దనుచున్నాడు

సీ. దక్కనట్టివి కోరి తట్టుపడఁగ నేల
దక్కినంతకె సంతసించరాదె?
యుప్పనంతయుఁ దిని యుపతపింపఁగ నేల
కొలఁదిపాటియ చవిగొనఁగ రాదె,
పాతి వేయఁగ నేల? బడలంగనేల? వాఁ
డిచ్చినంతకె మది మెచ్చరాదె?
కొత్తయె పొడసెక్కి విఱుగఁ బడఁగ నేల?
సాగినంతకె చేయి సాచరాదె?

ఆ. జీవులను భజించి సిలుగులఁ బడనేల?
శ్రీనివాసుఁ డాత్మఁ జిక్కియుండ,
నీఁత లేల? మోఁత లేల? తిప్పలయందుఁ
బొరల నేల? తృప్తిఁ బొరయ రాదె?

అందరానివాటి నాశించి బాధపడే దెందుకు? ప్రాప్తించిన దానితో తృప్తి పడరాదా! ఉప్పుతిని ఆరాటపడట మెందుకు? కొద్దిపాటిదో రుచిని అనుభవించ రాదా! పరుగులుదీసి యాచించే దెందుకు? అలసటచెందే దెందుకు? ఆ శ్రీనివాసు డిచ్చిన సంపదనే తృప్తితో అనుభవించరాదా! వెఱ్ఱిగా నిక్కినిక్కి విఱుగబడే దెందుకు? అందినంతవఱకే చెయ్యి సాచరాదా! అనగా మెరమెచ్చులకై హెచ్చుగా వెచ్చించి జాలిపోవడానికంటే ఉన్నంతలో సర్దుకోవడం మంచి దన్నమాట. ప్రాణి మాత్రులను సేవించి కష్టాలపాలు కావడ మెందుకు? శ్రీవేంకటేశ్వరస్వామి ఆత్మలో వెలుగుతుండగా ప్రాకులాడడ మెందుకు? అరుపులు ఆర్భాటా లెందుకు? అపమార్గాలలో పడడం దేనికి? సంతృప్తితో ఉండరాదా! ఉండవలెననుట

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఎంతలేదుచిత్తమా | 372 | 131 | 11-1భా | 88 |

## 283

అవ. జీవికి కర్మానుసారంగా మంచిచెడ్డలు భగవత్ప్రసాదంగా లభించును. ఆశతో అందనివాటికై ప్రాకులాడవద్దని హితము బోధిస్తున్నాడు.

సీ. మన సెంతయో యంతె మంగళమ్ము తనువు
　　కొలఁదియే సత్త్వమ్ము తలఁచినంత
తన కల్మి నెంచక తగనట్టి మురిపాల
　　పెనఁగఁ బోయిన తీపి పిప్పిఁ గలదె ?
విత్తినకొలదియే పెసలు పైరులు గూడ
　　నాఁకటి కొలఁది యాహార మెల్ల,
ముందు వెన్క గనక ముటుకొన్న పదుగేల ?
　　అందనిపండ్లకై యాస యేల ?
ఆ. కొండలప్ప సేవ కొలఁదియే మేలు, వాఁ
డిచ్చినంతవఱకె యొసఁగు సిరులు,
వెట్టిచేసి తొల్లి వెలకుఁగొన్నది గాక
వేఱుగలదె ? చింతపోరు లేల ?

'మతియెంతో గతియంత' అన్నట్లు మనస్సు మంచిదైతే సర్వశుభాలు సమకూడుతాయి మనోనైర్మల్య మవసర మన్నమాట. ఆలోచించగా శరీరాన్ని అనుసరించియే సత్త్వం ఉంటుంది. పిప్పిలో తీపి యుండునా ? తనకుగల సంపదతో తృప్తిచెందక తగని ఆశలకు లోనైతే ప్రయోజన ముండునా ? పైరు విత్తనము ననుసరించి మొలచును. ఆకటికొలది అన్నమన్నట్లు కడచినజన్మలో తానుచేసిన కర్మల కనుగుణముగానే ఈ జన్మలో కలిమి కలుగును గాని అధికముగా రాదు. అట్లు దురాశతో ప్రవర్తించడం ముడికి[illegible]లో పడుగు లిడుట, అందనిపండ్లకు అఱ్ఱులు చాచుట వలె వ్యర్థం. శ్రీశుని ఎంతగా కొలుతుమో అంతకు తగినంత మేలు ఆతడిచ్చును. భగవంతు డెంత అనుగ్రహించునో అంతే సంపద కలిగి మనదము. వెట్టిపాటి పూర్వజన్మలో తన కర్మలనెడి వెలకు కొన్నట్టివే యిప్పుడు తా ననుభవించే ఈ ఆపత్సంపదలు, జనసత్త్వాలు, శుభాశుభములు మొదలైనవి. ఇట్లుగాదు అట్లుగాదు అని ఇందుకు సంబంధించిన మొండిచర్చలు చేయడం దండుగ.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
| --- | --- | --- | --- | --- |
| వివరము పూరినట్టి | 216 | 33 | 3 | 65 |

## 284

అవ: మనసులో సంకుచితభావంలేని ఒప్పుకొన్నచో అన్నీ ఇంపుగానే ఉండు నంటున్నాడు

సీ. కాయధారణ మింపు కామినీసుఖ మింపు
వారికి వారి యాహార మింపు,
సోయగంపుఁగనులఁ జూచు వేడుక లింపు
స్వాంతమ్ము సమ్మతింపవలెఁ గాని.
పలుకు లన్నియు నింపు భావమ్ములవి యింపు
చెలరేఁగు తమ తమ చేఁత లింపు,
జలమలసంగతుల్ సహజమ్ము లవి యింపు
స్వాంతమ్ము సమ్మతింపవలెఁ గాని.

గీ. తమ జననములు తమ చక్కఁదనము లింపు
జగతివారికి వారల జాతు లింపు,
గరుడగిరినాథు మాయావికారము లివి
ఒడఁబడవలె మానస మ్మొగరు లేక.

తమచిత్త మంగీకరించినచో అనవాళ్యమగు ఈ శరీరము, స్త్రీలవొందువల్ల కలిగే సుఖము ఎంతో హితముగా నుండును. అట్లే ఎవరికివారు తినే ఆహారము, అందమైన తమకన్నులతో చూచే ఉత్సవాలు ఇంపుగానే ఉండును. మరియు మనసు ఒప్పుకొన్నచో దుర్భాషలు, వాటిలోని అభిప్రాయాలు, విజృంభించి తాము చేసే దుష్కార్యాలు, సహజముగా ఏర్పడే మలమూత్రాలు కూడా ఇంపుగానే తోచును. ఈ జగత్తులోని మానవులకు తమపుట్టుకలు, అందాలు ఇంపుగా అనిపిస్తాయి. అట్లాగే ఏ జాతివారికి ఆ జాతి గొప్ప దనిపించి ఇంపు కూర్చుతుంది. ఇట్లనిపించుట కేవలం గరుడగిరీంద్రుని మాయవల్లనే. మనసులో కించపడకుండా వీటిని సమ్మతించవలె.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సం॥ | పుట |
|---|---|---|---|---|
| హేయ మేమీలేదు | 381 | 178 | 11-Iభా | 126 |

# 285

అవ : పరమపదప్రాప్తికి పరంపరారూపంగా ఉపాయాలను పేర్కొంటున్నాడు.

సీ. అందాఁక వైష్ణవం బక్కడి కక్కడే
 యిందఱుఁ బాసిన నిర్మలుఁ డగు,
పాపంపురాసులు పరిహార మైననే
 పరమమగు గోవిందభక్తి వొడము,
స్థిరతరపుణ్యమ్ము చేరువయైననే
 శ్రీపతిదాసుల సేవ దొరకు,
కొట్టకొనకు మతి కోరి పాఱినన ని
 శ్చలు విష్ణుకథలందు చవి జనించు.
పట్టిన జన్మమ్ము పావన మైననే
 విమలమగు తిరుమంత్రము లభించు,

గీ. గురుకటాక్షమ్ము తన కొక కొంత సోఁకి
నప్పుడె ప్రపత్తి నిశ్చలం బగును, శేష
ధరనాయకు మానక కొలిచినపుడె
పరమపదమునకున్ దాను పాత్రుఁ డగును.

వైష్ణవము అక్కడి కక్కడే ఉండును. నిందలకు పాత్రుడు కానివాడు పవిత్రు డగును తన పాపసమూహాలు పరిహారమైనపుడే శ్రేష్ఠమగు గోవిందభక్తి ఏర్పడును. సుస్థిరమైన పుణ్యం దగ్గఱిల్లినప్పుడే శ్రీనివాసదాసులసేవ సమకూడును చిట్టచివరకు బుద్ధి ఉత్సహించినప్పుడే వైష్ణవకథాశ్రవణమందు రుచి తెలియును. తనకు వచ్చిన జన్మము పవిత్రమైననే పావనమగు తిరుమంత్రం లభించును. గురుకటాక్షమునకు పాత్రు డయితే నిశ్చలప్రపత్తి ఒనకు కుదురును శేషాచలాధిపతిని వదలక సేవించినపుడే తాను (భక్తుడు) పరమపదాన్ని పొందుటకు అర్హు డగును.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| అందాకా వైష్ణవ | 254 | 310 | 8 | 200 |

# 286

అవ : విష్ణుభక్తులయొక్క భగవత్సేవాప్రకారమును అభివర్ణించుచున్నాడు

సీ. వినియెడు వీనుల వనజాక్షుకథలకే
  పనిగొందు రెపుడు ప్రపన్నజనులు.
కనియెడు కన్నులు కైటభాంతకునియం
  దనువుపఱతురు మురారిబంట్లు,
పలికెడి పలుకులు పరమపూరుషునికై
  యలవఱతురు శరణాగతులును,
తలఁచెడి తలఁపులు ధరణీధరునిమీఁదఁ
  బాయంగనీరు తదీయు లెపుడు,

గీ. కలియుగమ్మున శ్రీశుకైంకర్యములనె
మరియుచుం జేయుచుందురు ముముక్షువులును,
వేంకటేశ్వరు మతమునే విశ్వసింత్రు
వైష్ణవులు విష్ణుకీర్తనపరులు గురులు.

ప్రపన్నులగువారు వినెడిశక్తిగల శ్రవణేంద్రియమును ఎప్పుడు భగవంతుని కథలు వినుటకే వినియోగింతురు చెవులు భగవత్కథలు వినుటచే సార్థకములగు ననుట మురనరాక్షసుని హతమార్చిన విష్ణువియొక్క దాసులు చూచేశక్తిగల కన్నులను కైటభరాక్షస సంహర్తయగు మురారిమూర్తిని తిలకించుటయందే లగ్నమొనర్తురు. కనులు గలిగినందుకు ఫలము దైవమును సందర్శించుటయే యనుట. శరణాగతినందినవారు తమమాటలను పరాత్పరుని స్తోత్రములకు, నామపారాయణాదులకు అలవడచేతురు. ఆ భక్తులు తమ మనసులోని కోరికలను వరాహావతారుడై భూమినెత్తిన నాగనగవిరాజమానునుండి మరలింపరు. మోక్షమందు అపేక్ష గలవారు ఈ కలియుగములో లక్ష్మీవల్లభుని కైంకర్యం చేస్తూ మురిసిపోవుచుందురు విష్ణుభక్తులు విష్ణుకీర్తనలందు ఆసక్తికలిగిన గురుమహారాజులు వారు శ్రీస్వామివారికి అభిమతమగు రీతి యేదో దానినే నమ్మి నడతురు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపుట | పుట |
|---|---|---|---|---|
| మరిగి వీడెవో | 83 | 402 | 1 | 269 |

# 288

అవ క్షమించి రక్షించే పుండరీకాక్షుని రక్షణ కోరని ప్రయత్నాలు విఫలము లగునని ఉపదేశించుచున్నాడు

సీ. కన్నవారల వేఁడ కన్ని పక్కునె గాక
ఈశుఁ డీయని వారు లీయఁ గలరె ?
ఎన్నికఁ దను విచ్చె నిహముఁ బెంపఁగ నిచ్చె
నున్న వా రీ పని నోపఁ గలరె ?
తాఁ బట్టపా చెందుఁ దనటు దక్కునె గాక
రానిది తే నొక్కరకు వశంబె ?
కనుపులో నుండ గాఁ గలవి నుదుట వ్రాసె
తనవి దైవముచేత దాఁటఁ దరమె ?

గీ. అక్కజపుసంపదకు శ్రమ దక్కుఁ గాక
వేగుకొండలవిభుఁ డొప్పఁ గీకపోఁడు,
సతత మతనికె శరణన్నఁ జాలుఁగాక
తప్పు లొప్పులు దేవుఁ డాతనివె గావె!

అగపడ్డవారినంతా అడిగితే కష్టం దక్కుతుందేగాని పరాత్పరు డీయలేని దానిని అల్పు లీయగలరా ? ఈయలే రనుట ఆ దేవుడే ఈ శరీరాన్ని ఇచ్చాడు ఇహలోకవైభవాలను గూడ కల్గించినాడు. తక్కినవారీపని చేయగలరా ? చేయలే రనుట తన శ్రమకు తగినంతగానే ఫల మబ్బుతుంది గాని అంతకు మించి సంపాదించుటకు ఏ ఒక్కరికైన సాధ్యమా ! కా దనుట తాను గర్భస్థుడైనప్పుడే పూర్వకర్మానుసారంగా పుణ్యపాపాలను దైవం నొసట వ్రాసినాడు ఆ దైవనిర్ణయాన్ని దాటడానికి ఎవరికినీ శక్యము గాదు అందరాని సంపదలకు అర్రులు చాచితే శ్రమ మాత్రమే మిగులుతుంది ఏడుకొండలరాయని ఆశ్రయిస్తే అతడెప్పుడుగాని మన కోరికల నీడేర్చక పోడు ఎల్లప్పుడు ఆ దేవుని శరణు వేడితే చాలును తప్పులొప్పులు అతనివే

అనగా క్షమించి అన్నిటిని ఒప్పులుగానే గ్రహించు ననుట.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| పని మాలినట్టి | 81 | 380 | 1 | 280 |

# 289

అవ. శ్రీనివాసునిసేవ సంపత్ప్రదమని, హరినామస్మరణం అమృతపానమే యని చెప్పుచున్నాడు

సీ. ఆత్మలోనుండి దేహంబు నోమెడి హరి
నొల్లమి తన్నుఁ దా నొల్లకుంట;
అతని బల్లిదు మాని యన్యుల వేఁడుట
గొల్లకట్టును దంచి పోఁగు లిడుట,
ఎట్టిపుణ్యఫలమ్ము లేమిగల్గిన హరి
కీకున్న నది దైవ మీయకుంట,
వాని కర్పణ మొనర్పని భోగము లవెల్ల
తవిలి చెఱకు పిప్పి చవులు గొంట,
గీ. శ్రీవధూటీవిభుం డైన శ్రీనివాసుఁ
జేకొనుట సిరు లన్నిటిఁ గైకొనుటయె,
నోర శ్రీహరినామమ్ము నుగువు లెల్ల
జుల్లుజుల్లున నమృతంబు జుఱ్ఱుకొనుట.

ఆత్మలో నివసిస్తూ శరీరాన్ని రక్షించే హరిని అంగీకరించకుండుట తన్ను దా నొప్పుకొనక పోవుటే. బలవంతుడగు శ్రీహరిని వదలిపెట్టి ఇతరులను వేడుట గల్లకొట్టును దంచి పోగు పోయుటయే. అనగా నిష్ఫల మనుట. ఎట్టిపుణ్యఫలములు తనకు లభించినను వాటిని భగవదర్పణ చేయకుండుట తనకు ఎన్నడు కరుణతో భగవంతు డనుగ్రహించక యుండుటే అగును. దేవునికి సమర్పించక భోగ్యవస్తువు లనుభవించుట రసహీనమైన చెఱకు పిప్పిని చప్పరించుటయే యగును రమానాయకుని గ్రహించి సేవించుట సకలసంపదలనుపొందుటయే అగును. నోరార గోవిందనామమును పలుకుట జుల్లుజుల్లు మని సుధారసమును జుఱ్ఱుకొనుటయే యగును

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇంతే మతేమిలేదు | 32 | 338 | 1 | 267 |

# 290

అవ కష్టములు, పాపములు పోగొట్ట సమర్థుడు శ్రీవేంకటేశ్వరు డుండగా ఇతరుల జేరుట నిష్ఫల మనుచున్నాడు.

సీ. తెగనియాపదలకు దేవుఁ డుండెను గాక
 ఎగ లుడుపంగ నెవ్వరి వశమ్ము ?
నొగిలి యన్యులకుఁ దా నోళులు దెఱచిన
 నగుబాటుగాక మాన్పంగఁ గలరె ?
అగ్గలపుటఘమ్ము హరియె మాన్పుఁ గాక
 పరులు చెచ్చెర వచ్చి పాపఁ గలరె ?
తగ్గుమొగ్గులవేళ తలఁచినవా రెల్లఁ
 జేర వత్తురె ? సిగ్గుచేటుగాక,

గీ. ఎట్టుసేయంగ వలెనొ వాఁ డెఱుఁగుఁ గాక
కట్టకడవారు కరుణింపఁ గలరె ? వేంక
టేశ్వరుం డేమి యడిగిన నిచ్చుఁగాక
ఊరడింతురె త మ్మొరు లుట్టిపడుచు.

అంతంలేని ఆపదలను అంతం చేయడానికి ఆ ఏడుకొండలవా డున్నాడు కాని కష్టములు తొలగించుటకు ఇతరు లెవ్వరికి సాధ్యము? పరులసాయమునకై నోళ్ళు తెరచుకుంటే నగుబా టగునే గాని వారు తమ కష్టాలు తీర్చగలరా? అధికపాపములను హరి హరించునే గాని ఇతరులు వేవేగ వచ్చి మాన్పగలరా? కష్టములు దుఃఖాలు కలిగినప్పుడు సిగ్గుచేటుగాక అనుకొన్నవా రందరూ ఆదుకొందురా? అవసరములు గుర్తించేవాడు శ్రీవేంకటేశ్వరుడే ఇతరులు దయ చూపగలరా? దేని నడిగినను ఇచ్చువాడు ఆ కొండలరాయడే. ఎవరైనను వేరే వారు ఉట్టిపడి ఊరడింతురా? ఊరడింప రనుట.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇన్నిచేఁతలును | 34 | 210 | 1 | 140 |

# 291

అవ. వేదాంత సారమంతా తొమ్మిదిమాటలలో ఉన్నదనుచున్నాడు

సీ. మూఁడెమాటలు మూఁడుమూళ్లు తొమ్మిది సర్వ
వేదాంతమర్మ మీ విధము గనుఁడు
జీవస్వరూపమ్ముఁ జింతించి యామీఁద
భగవంతు దివ్యవైభవము దెలిసి
భావించి ప్రకృతిసంపదనెల్ల నెఱుఁగుటే
యఖిలవేదాంతరహస్య మగు
తనలోని జ్ఞానమ్ము తప్పక తలపోసి
తమ్ముల మగు భక్తి తవర నిల్పి
మదిని వైరాగ్యమ్ము మఱవక యుండుట
సకలవేదాంతమ్ము సార మగు

గీ. అతులితాచార్యవిశ్వాస మాత్మ గలిగి
చక్కనౌ శరణాగతి సాధనముగ
వాసిగా వేంకటేశ్వరుదాసుఁ డగుట
అవ్యయానందకందవేదాంత మగును.

వేదాంతములో గ్రహింపదగిన మాటలు మూడుమూండ్లు తొమ్మిది ఆ తొమ్మిదిమాటలలో వేదాంత మంతా ఇమిడి ఉంది. జీవుడు, దేవుడు, ప్రకృతి, జ్ఞానము, భక్తి, వైరాగ్యము, ఆచార్యవిశ్వాసము, శరణాగతి, భగవద్దాస్యము లనేవే ఆ తొమ్మిదిమాటలు.

ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు అని తత్త్వములు మూడు జీవునిస్వరూప మెట్టిదో బాగుగా మొదట తెలుసుకోవలె అటుపై ఈశ్వరుని దివ్యవైభవాన్ని లెస్సగా అర్థం చేసుకోవలె ప్రకృతిసంపత్తిని పరిపూర్ణంగా ఆలోచించి తెలుసుకొనడమే వేదాంతములోని రహస్యము తనలోనుండే జ్ఞానాన్ని ఎఱిగి ఆ జ్ఞానమునకు కారణమైన భక్తిని చక్కగా స్థిరపరచుకొని, వైరాగ్యమును మనస్సునందు వదలకుండుటే వేదాంత మంతటియొక్క సారము ఇక గురువుపై సాటిలేని విశ్వాసం కలిగి శరణాగతిని మోక్షసాధనంగా గ్రహించి ఏడుకొండలవానికి దాసుడుగా ప్రసిద్ధి చెందడమే నిరతిశయానందానికి మూలభూతమైన వేదాంతముగా చెప్పవచ్చును

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| మూఁడేమాటలు | 150 | 293 | 2 | 158 |

## 292

అవ దైవ మానుష కృత్యములకు గల తారతమ్యమును వర్ణించుచున్నాడు.

సీ. గాలిఁబోయెడిని లోకములోని మాటలు
గాలిఁబో వెపుఁడు శ్రీకాంతు నుతులు,
సంసారభోగముల్ జాలిఁ బడెడిసేత
లసురాంతకుని పూజ లట్లుగావు,
మానుషకృత్యముల్ మాయమౌ గొన్నాళ్ళ
కఖిలేశు మహిమమ్ము లట్లుగావు,
కాయికమ్ములె తమ కల్పితా లన్నియు
నచ్యుతు మన్నన లట్లుగావు,
గీ. క్రమముగా నుడిపోవును కర్మఫలము
లంబుజాక్షునిపై భక్తి యట్లుగాదు,
పరు లాసంగెడి వరము లస్థిరము లరయ
శ్రీనివాసుని వరములు చెడవు చెడవు.

లౌకికములగు పాట లన్నియు గాలిలో కలసిపోవు నట్టివే లక్ష్మీభర్తను గూర్చిన స్తోత్రములు ఆ విధముగాపోక గట్టిగా నిలచి ఉపయోగపడును. సంసారికములైన భోగములన్నియు చివరకు జాలిని గల్గించు నట్టివే రాక్షసాంతకుడైన శ్రీహరి కైంకర్య మట్లుగాక ఆనందమును సమకూర్చును మానవులు చేసే పనులు కొంత కాలానికి రూపుమాసి పోవు నట్టివే. అఖిలమునకు అధిపతియైన అచ్యుతుని మహిమలు అట్లుపోక కలకాల ముండును. తాము కల్పించున వన్నియు కేవల శారీరకములే అందుచే నవి క్షణికములు నాశరహితుడైన భగవానుని మన్ననలు చిరస్థాయులు కర్మఫలములు అనుభుక్తములై క్రమముగా నశించిపోవును తామరలబోలిన కన్నులుగల శ్రీహరియొక్క భక్తి మాత్రం ఎన్నటికినీ తరుగదు ఇతరు లిచ్చు వరములు ఆలోచింపగా అస్థిరములు శ్రీనివాసు డిచ్చే వరాలు ఎన్నటికినీ చెడవు

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| తలఁచుకోవో మనసా | 152 | 242 | 2 | 162 |

# 294

అవ ప్రతివస్తువునందును తారతమ్య మనివార్య మని సోదాహరణముగా సూచించు చున్నాడు

సీ. అందఱిలో దేవుఁ డలరు, నం దధికులు
కొందఱు, హీనులై కొంద ఱుందురు,
పొలయు గాలి యొకండె పొలముపంట యొకండె
మేలుగింజలు నిల్చు తాలు తొలఁగు,
జన్మ మందఱకును సమమె, బంటులు కొంద
ఱేలికల్ కొందఱై యొసఁగుచుందురు,
వరిగుణములతోడ సరిదూఁగినను చిన్న
లొకటికి మేలు తీ లొకటి కాదె,

గీ. భుజగనగనాథు గర్భస్థులై జగాలు
కొన్ని క్రిందివి మీఁదివై కొన్ని యున్న,
విటులె తద్దాసు లున్నతి కెక్కు నసుర
లగుచుఁ గొందఱు క్రిందికి దిగిరి కడకు.

సకలప్రాణులలో దేవుడు సమానముగనే ఉన్నాడు అయినను వారిలో కొందఱు గొప్పవారు, మఱికొందఱు హీనులు. వీచేగాలి, పండించే పొలం ఒక్కటే అయినప్పటికి గట్టిగింజలు కళ్ళములో నిలువగా, తాలుగింజలు దూర మగును మానవజన్మ మొక్కటేగాని అందులో కొందఱు బంట్లు, మఱికొందఱు ప్రభువులు పరిమాణంతో చిన్నలు సరితూగినను విలువలో పెద్ద మేలుగా, చిన్నలు కీడగా పరిగణింపబడుచున్నవి. ఫణిగిరీంద్రుని కుక్షిలో పదునాల్గులోకా లున్నను వాటిలో కొన్ని పైన, మఱికొన్ని క్రింద నున్నవి పై తీరుగానే వేంకటాచలాధిపుని దాసులు పై కెక్కగా (శ్రీవైకుంఠము చేరగా), మఱికొందఱు రాక్షసులై పతితుల (అధోలోకగతులు) అగుచున్నారు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| ఇంతేపో వారివారి | 208 | 14 | 3 | 10 |

## 296

అవ  దైవమాయావిలాసమును వర్ణించుచున్నాడు.

సీ.  కొలఁదిబ్రహ్మాండంపుఁ గుంచెనలోపలఁ
        గులికి జీవు లనెడి కొలుచు నించి
దుర్మోహ మనియెడి దొడ్డరోఁకలి వేసి
        తలకొని తనువుల దంచు మాయ
తొంగలిరెప్పలఁ దులకించు పవలు రే
        లనెడు కన్నుంగవ నల్లలార్చి
కవలను నిడుదలౌ కరముల నూఁచుచు
        దంగుడు పాలుగా దంచు మాయ

గీ.  ఇరుదరుల కూఁతఁ ద్రోయుచు వృషగిరీంద్రు
నామమీఁదఁ బాడుచును విన్నాణిజీవు
లనెడి బియ్యము స్వామికి ననవరతము
సంచులం బోసి యొసఁగంగ దంచు మాయ.

మాయయనెడు వనిత కొద్దిదైన బ్రహ్మాండమనే కుందెనలో జీవులనే ధాన్యాన్ని పోసి మోహమనే రోకలితో దంచుచున్నది తన వాలురెప్పలతో పరికించే రాత్రింబవళ్ళు అనే కన్నులజతను అల్లార్చుచు దిక్కులనే తన పొడవైన చేతుల నూపుచు, పాపపుణ్యములనే ఇరుదరులనుండి చెదరే బియ్యమును కుదుట లోనికి నెట్టుచు వృషభాచలేశ్వరునిమీద నువ్విపాటలు పాడుచు జీవులను ఆ మాయ దంగుడుబియ్యముగా దంచుచున్నది. ఇట్లు దంచి విజ్ఞానస్వరూపునైన జీవు లనెడి ఆ బియ్యమును సంచుల నెత్తి మాయ ఎల్లప్పుడు స్వామికి సమర్పించును

మాయకు వశుడై జీవుడు కష్టసుఖము లనుభవించి భక్తి ప్రపత్తులచే భగవత్కృపకు పాత్రుడై తుదకు పరమాత్మునిసన్నిధికి చేర గలడని తాత్పర్యము

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| పరమాత్ముని నోరఁ బాడుచును | 21 | 130 | 1 | 80 |

# 297

ఉ: సర్వము పరమాత్మస్వరూపమే యనీ, అన్నియు పవిత్రములే యని పలుకుచున్నాడు

సీ. పరమాత్ముఁ డొక్కఁడే పరమపవిత్రుండను
　　　పరిపూర్ణుఁ డనెడు భావంబె చాలు
హేయమిం దేదుపాదేయ మిం దేది? శ్రీ
　　　హరి సర్వపరిపూర్ణుఁ డయి చెలంగ,
గుణభావజీవకల్పనలు సేసెడునేని
　　　పమ్మిన తనదు మాయమ్మె రోఁత,
జాతియిం దే దంత్యజాతి యిం దేది? యీ
　　　జాతు లన్నిట నాత్మ శార్ఙ్గధన్వి
అతల నంటు ముట్టను భావనలు తన
　　　తెలియంగఁ జాలని తెలివి యగును,

గీ. తెలివిగలదాఁక నియ్యది తెగని మఱుఁగు,
తెలిసినంతటఁ దీఱు సందియము లన్ని
ధరణి శ్రీవేంకటేశ్వరుకరుణవలన
వెలయు నీ జ్ఞానమును మది విడువరాదు.

పరమాత్మ యొక్కడే పరమపవిత్రుడు, పరిపూర్ణుడు అనే భావము జీవునికి కలిగిన చాలును. శ్రీహరి అంతట నిండి విలసిల్లుచుండగా ఇందులో గ్రహింప దగిన దేది? వదల దగిన దేది? అన్నియు గ్రాహ్యములే యని భావము. గుణములయు భావములయు జీవులయు కల్పనములను చేయబూనినప్పుడు వర్ధిల్లిన తన భ్రాంతియే తనకు రోత యగును. అన్ని జాతుల వారిలోను శార్ఙ్గమనే ధనుస్సును ధరించిన శ్రీనివాసు డుండగా మరి యీ జాతులందు హెచ్చుతగ్గు లెక్కడివి? జాతులలో హీనాధికతలు లేవనుట. అటుపై అంటుముట్టు లను భేదభావము వహించుట తన తెలివితక్కువతనమే యగును. జ్ఞానోదయమగు వరకిది వదలని తెరగా నుండును. జ్ఞానియైనచో సందేహము లన్నియు నశించి పోవును. స్వామిపై శ్రీవేంకటేశ్వరునిదయవల్ల కలిగే యీ భేదరహితజ్ఞానమును ఎన్నడు విడువరాదు.

| కీర్తన | రేకు | సంఖ్య | సంపుటి | పుట |
|---|---|---|---|---|
| పరమాత్ముఁ డొక్కఁడే | 133 | 188 | 2 | 91 |

## 293

అవ స్వామివారి బ్రహ్మోత్సవం చూస్తూ, పరవశించి అనందిస్తున్నారు

సీ. దిక్కులు సాధించి దేవదుందుభి రవం
మొరఁగంగ వీసుల నేగుదెంచె
నదిగో గోవిందుతేరు, రిదె గరుడపతాక,
కదలెడి ఘనతురంగమ్ము లవియె,
అవియె పూదండ, లల్లవె వాఁగు ఘంటలు,
వారె యప్సరసు, లవ్వారె ఋషులు
వారే యనంత విష్వక్సేన గరుడాదు,
లవ్వారె కొలుచు బ్రహ్మాదిసురులు

గీ. వాఁడె పద్మావతీమనోవల్లభుండు
శంఖచక్రాదులం బొల్చు సప్తశైల
వాసుఁడు వరమ్ము లొసఁగెడు వాఁడు వీని
తమిని సేవింపుఁ డేడేఁటు తప్పకుండ.

అదిగో! గోవిందుని రథం దిగ్విజయంచేసి దేవవాద్యాలు మోగుతుండగా తిరువీధులవెంట ఊరేగుతున్నది అల్లదిగో గరుడధ్వజం అవే ఉదుటైన ఉత్తమాశ్వాలు అవే పూలమాలలు అల్లవే వాగుపట్టి గంటలు ఆ నాట్యమాడేవారు అప్సరసలు వారే ఋషులు. అనంతుడు, గరుత్మంతుడు, విష్వక్సేనుడు మున్నగువారు అ కనపడుతున్నవారే స్వామిని సేవిస్తున్న బ్రహ్మాదిదేవతలు, కూడ వారే. పద్మావతీహృదయమువకు ప్రియుడైన శ్రీవేంకటేశ్వరుడు అదిగో శంఖచక్రాలు ధరించినవాడు, వరాలిచ్చేవాడు, ఏడకొండలపైనుండేవాడు అతడే ప్రతిసంవత్సరం జరిగే ఈ బ్రహ్మోత్సవములో ప్రీతితో స్వామిని నాదాయనుని సేవించి తరించండి.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| దిక్కులెల్లాసాధించి | 287 | 501 | 3 | 337 |

## 299

ఉ॥ శ్రీవేంకటేశ్వరుని అప్రాకృతదివ్యాయుధాలు భక్తులకు రక్ష యనుచున్నాడు.

సీ. సలలితమ్ముగ హరిచేతిశంఖచక్రమ్ములు
కలిత యయి మమ్ములఁ గాచుఁగాక!
కను లేసెతరములఁ గల గదాపద్మముల్
మమ్ముల గావుత మమతతోడ
సమరజయము నిచ్చు శార్ఙ్గాదిశస్త్రముల్
మా కంఠదండమై మనుపుగాత!
మోహనరూపుండు మొలగట్టినకటారి
యంచెల రక్షయై యమరుఁగాత!

గీ. కోరి శ్రీవేంకటేశు డాగులు భుజాల
తాల్చియున్నార మిలలోన దయ దలిర్ప
శౌరికై దువు లాప్తహస్తములు మాకు
సర్వవేళల వజ్రపంజరము లవుత!

హరి చేతులనుండు శంఖచక్రములు మాకు దిక్కై ఎప్పుడు కాపాడుగాక. కమలాప్రియుని చేతులందుగల గదయు పద్మమును అభిమానముతో మమ్ముల నేలుగాక. యుద్ధములో జయమునిచ్చు శార్ఙ్గాద్యాయుధములు మాకు కంఠసీమగా నుండి మనుపుగాత. జగములను మోహింపజేసే రూపంగల శ్రీనివాసుడు మొలలో గట్టుకొన్న కటారి అడుగడుగున మాకు రక్షయై యుండుగాక. అపేక్షించి నారాయణుని శంఖచక్రముద్రలను మేము భుజములందు ధరించి యున్నారము. అతిశయమైన దయచే ఈ లోకంలో ఆయుధాలతో నొప్పిన ఆ శ్రీహరిబాహువులు అన్నియు ఎల్లప్పుడును మాకు వజ్రపంజరము లగుగాక.

| సంకీర్తన . | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| కోరి దాగుభుజముల | 117 | 101 | 2 | 88 |

## 300

అవ శ్రీవేంకటేశ్వరస్వామికి మంగళనీరాజన మిస్తున్నాడు.

సీ. శ్రీదేవితోఁ గూడఁ జెలఁగుచు నవ్వెడి
యాదిమపురుషున కారతు లివె
మేదినీరమణితో మేలమ్ము లాడెడి
యాదిత్యతేజున కారతు లివె
సురలకు నమృతమ్ము సరవడి నొసఁగిన
క్షీరసాగరశాయి కారతు లివె
తరమిడి దుష్టుల దనుజుల నడఁచిన
యరిభయంకరునకు నారతు లివె

గీ. అతుల కల్యాణనిధియైన యనంగగురున
కచ్యుతున కివె యారతు లంజనాద్రి
మందిరములోన నలమేలుమంగఁ గూడి
యలరు శ్రీవేంకటేశున కారతు లివె.

శ్రీమహాలక్ష్మితో సంతోషముగా నవ్వుతున్న ఆదినారాయణుడును, భూదేవితో పరియాచకములాడు సూర్యతేజస్కుడును, దేవతలకు అమృతము క్రమముగా పంచి పెట్టిన పాలకడలిలో పవళించు వాడును, వరుసగా దుర్మార్గులైన రాక్షసులను దును మాడి శాత్రవులకు భీతిగొలుపువాడును, నిత్యమంగళములకు నిధానమైనవాడును, మన్మథునకు జనకుడును, అంజనగిరిమందిరములో అలమేలుమంగాసమేతుడై అలరునట్టి శ్రీవేంకటేశ్వరస్వామివారికి ఇవే మంగళనీరాజనాలు.

| సంకీర్తన | రేకు | సంఖ్య | సంపు | పుట |
|---|---|---|---|---|
| అంగన రీతే యారతులు | 980 | 348 | 26 | 231 |

## సవరణలు

[అవతారికయందలి పంక్తుల లెక్క]

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 5 | 3 | పక్షుల | ఏన్గుల |
| 6 | 10 | (బలరామావతారం) | (కృష్ణావతారం) |
| 12 | 18 | (క్రొత్తరిచి) | (క్రొత్తలిపి) |
| 27 | 8 | మఱుఁగక | మరిగతి |
| 33 | 15 | నామయే | నామమే |
| 37 | 16 | గలవాడు | గలవాడు, |
| 46 | 3 | పెదుకరయ్య | పెదకరయ్య |
| 49 | 15 | గడవ | గడమ |
| 51 | 9 | నెరపేర | నెరవెర |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 62 | 3 | పాలజలనిధి | పాలజలధి |
| 67 | 18 | పెరిగినది | పెరిగినది. |
| 69 | 20 | నీఘలే | నీకథలే |
| 75 | 18 | చీర | చీర |
| 78 | 11 | ఋతుప్రొడపు | ఋతుప్రౌఢవు |
| 78 | 20 | పరాధిను | పరాధీను |
| 78 | 21 | కాని. | కావి, |
| 80 | 4 | కరదార | కరదాఁక |
| 81 | 10 | నభేదత | నభిన్నత |
| 85 | 18 | పరమశ్లోకం | శ్రీకృష్ణపరమశ్లోకం |
| 86 | 2 | వెదుక | వెదక |
| 86 | 4 | వెదుక | వెదక |
| 121 | 6 | కమలాప్రు | కమలాప్తు |
| 124 | 10 | శీ | గీ |
| 124 | 22 | తుంబరు | తుంబురు |
| 124 | 23 | ఎంలదుకు | ఎందులకు |
| 136 | 20 | మరలించను | మరలించుము |
| 149 | 10 | జ్ఞానమతు | జ్ఞానవంతు |
| 150 | 10 | లెదపెట్ట | వెదపెట్ట |
| 151 | 5 | మేమితే | మేమిదో |
| 154 | 8 | యూసంపార | సంసార |
| 1 3 | 2 | వేంటనే | వెంటనే |
| 173 | 18 | వ్తైరాగ్యం | వైరాగ్యం |
| 177 | 22 | గాజుపెంకును | గాజుపూసలను |
| 224 | 14 | గాధ | గాథ |
| 231 | 1 | గుర్తైబుంగ | గుర్తెబుంగ |
| 234 | 10 | దాగు | దాఁగు |
| 237 | 24 | అన్వేంషిప | అన్వేషింప |
| 239 | 18 | తీపినితిన | తీపినితిన |
| 239 | 20 | ఎక్కడ | ఎక్కడా |
| 249 | 1 | తెఱుఁగ | నెఱుఁగ |

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 249 | 24 | ఇతనిన్ని | ఇతరులకు |
| 251 | 4 | వేధు | వేదు |
| 251 | 6 | పైబడు | పైఁబడు |
| 252 | 13 | తనకు | తనకుఁ |
| 252 | 20 | దాతి | దారి |
| 254 | 7 | మఱుగాయె | మఱుఁగాయె |
| 260 | 8 | విరాదారి | విరాజారి |
| 261 | 9 | గడువంగ | గడవంగ |
| 267 | 14 | క్మర | కర్మ |
| 268 | 11 | కోరికలను | కోరికలకు |
| 266 | 24 | వశ్యలము | వశ్యరము |
| 269 | 17 | గడుఁపుతున్నాము | గడుపుతున్నావు |
| 271 | 18 | పతియై | పతియే |
| 272 | 6 | దొక్కు | దొక్క |
| 272 | 22 | అనే | ఈ |
| 288 | 18 | చపలబుద్ధులు | చపలబుద్ధులు, |
| 293 | 16 | సంసారిక | సాంసారిక |
| 295 | 11 | గర్వష్ఠ | గర్వష్ఠ |
| 297 | 17 | కుదుట | కుదుటి |
| 299 | 1 | పరుస | వరస |
| 299 | 14 | దేదేడు | దేఁదేఁడు |
| 300 | 7 | మమప్ప | మనుష్యుఁ |

76వ పుట 29వ పంక్తి మొదటనున్న 'పీవు' తొలగింపవలెను.

182వ పుట 20వ పంక్తిలోని "ఈనాడు" తొలగింపవలెను.

210వ పుటలోని పద్యతాత్పర్యము—"వైరాగ్యమునకు తగులము లన్నింటికి సంసారము" అన్నంతవరకు "వైరాగ్యము మోక్షమునకు, సౌఖ్యానికి శాంతం, దుఃఖాలకు క్రోధం, జన్మలకు కర్మలు, జ్ఞానము ఎడతెఱపిలేని విష్ణుభక్తికి, సద్భావము అలముకొన్న ధ్యానమునకు, సంసారలంపటత్వమునకు శరీరము, ఆచార్యుడు సుజ్ఞానానికి, జగత్తునకు ధనము, తగులములన్నింటికి సంసారము" అని చదువుకొనవలెను.

దేశచ్ఛందంలో మీరు అన్నమయ్యను అమృతస్రోతస్విని చేసి తెలుగు నేల మీద పారించారు తెలుగుప్రజలంతా మీకు ఋణపడ్డారు. —శేషేంద్ర.

ఆనాడు అన్నమయ్య కీర్తనలరూపంలో భక్తిరసామృతాన్ని అందిపెట్టారు. ఈనాడు మీరు ఆ అమృతసారాన్ని మధురమైన సీసములలో అందించారు. శైలి సరళసుందరభావబంధురం —జానమద్ది హనుమచ్ఛాస్త్రి.

"అన్నమాచార్యులే యిట్టు లవతరించి
వ్రాసెనేమో కీర్తన లన్ని సీసములుగ"
'దాసత్వము భక్తియు పెం
పేసిన సీసపద్యరచన ప్రీతియొనర్చెన్ —యల్లంరాజు శ్రీనివాసరావు
వెదకితివా పాటలలో
పదములు! తమయంత వచ్చిపడి సీసములో
నొదిగినవి, కొండదేవర
పదములు మది గునిసినట్లు పండితవర్యా!
మీ యమృతసారసంగత
పీయూషఝరీ ప్రవాహపేశలపద నీ
శ్రేయసద భారతి గ్రై
పేయములను గాంచినాడ విబుధస్తుత్యా! —కుంటిమద్ది శేషశర్మ.

అన్నమాచార్యులు కొండన్నపై చెప్పిన వేలకీర్తనల్లో సారాన్ని నేటి కొండమయ్య సీసాల్లో భద్రంచేయటం చాలా ఆనందదాయకమైన విషయం. మీ వయస్సు గురించి క్రొత్తగా చెప్పేదేముంది? శేషేంద్ర ఏనాడో చెప్పినారు
—డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

అన్నమాచార్యులవారి మూడువందల అధ్యాత్మసంకీర్తనలకు మీరిచ్చిన సీస పద్యాలరూపం ఎంతో మధురంగా ఉన్నది. మూలంలోని తెలుగుదనాన్ని, [illegible]దనాన్ని, వ్యంగ్యవైభవాన్ని, అలంకారశోభామార్గాన్ని తెలుగుపద్యాల్లోకి [illegible] రాగలిగినందులకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. అనువాదమైనా, స్వతంత్రరచనలాగా సీసపద్యాలు జాలువారేటట్లు చేశారు. అన్నమయ్య సంకీర్తనల్లాగానే మీ సీసపద్యాలుకూడ తెలుగువారి ఆదరాభిమానాలను పొందగలవని ఆశిస్తున్నాను. అన్నమయ్యరచన అమృతం మీరచన అమృతసారం

—డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం.

పదకవితపై చిన్నచూపు ఉన్న ఆంధ్రదేశంలో పద్యకవితాశిల్పంలో సిద్ధహస్తుడైన ముదివర్తి కొండన్న అన్నమయ్యసంకీర్తనలు ఎంపికైన మూడు వందలపైసాలలో సాహితీద్రాక్షాసవంచేసి అందించడం గొప్పవిశేషం మీరు ఇన్ని సీసాలు గుండెలో పండించుకొన్న భక్తిపరిణతితో వ్రాయటం నాకు ఆశ్చర్యం కలిగించింది ఇంతభక్తి కుదరటం కేవలం పూర్వజన్మపుణ్యపరిపాకం అన్నమాచార్యులతో పోటీపడితే భక్తిపరుగుపందెంలో కొండమాచార్యులు కొంత వెనుక పడవచ్చునేమోగాని ప్రౌఢకవితాపాటవంలో ముందంజలోనే ఉంటాడని మీ సీస పద్యాలు తీర్పుచెప్తున్నాయి మీరు అన్నమయ్యసంకీర్తనలు సీసాలలోకి అనువదించటం కేవలం నిరహంకారపూరితమైన "దాసోఽహం' భావమే

—డా॥ నండూరి రామకృష్ణమాచార్య

ముదిమైన నాకు వత్తిగ
పదమలకావ్యమగు నమృతపాకము నిచ్చెన్
వడిఁ దిరుమలేశు ముక్తి
వడయుదుఁ గాంచితి, నీ 'గృహాఖ్య' కంటిలె సెస్సా ।— వావిలాల రామమూర్తి.

నమ్ము - నాదుమాట గురునాథ! నిజమ్మది, దివ్యకావ్య స
త్యమ్ములఁ ప్రోదిసేయు కవిచంద్రులు మీరు, మనోజ్ఞవైఖరిన్
సమ్మతి తేటతెన్గుసుడికారపు సొంపులు గుల్క సీసప
ద్యమ్ముల నన్నమార్యకవితాసుధనింపి తెలుంగువారి హ
స్తమ్ముల కెత్తినా రమృతసారము ముక్తిరమావిహారమున్
కొమ్మల డాఁగి కోయిలలు కోటిగళమ్ముల పాడినట్లు పు
ష్పమ్ముల మూగి తుమ్మెదలు శ్రావ్యముగా నినదించినట్లు కీ
రమ్ములు వేదపారగు స్వరమ్మును దప్పక పల్కినట్లు మే
ఘమ్ముల గాంచి నెమ్మలిగుంపులు నాట్యము చేసినట్లు పా
త్రమ్ముల దుగ్ధమున్ శిశువు చంటల గాజులు మ్రోగినట్లు వా
టమ్ముగ నొడ్డుసేర కెరటమ్ములు నవ్వది సేసినట్లు తా
రమ్ముగ వీణియల్ మెరసి రాగసుధల్ కురియించినట్లు నా
కమ్మున దేవతానికాయము చల్ తల లూచినట్లు మో
దమ్మున యోగిపుంగవులు ధ్యానసమాధి మునింగినట్లు చి
త్రమ్ము[illegible]విధమ్ముల మానసవీథి దోచె మీ
కమ్మని కావ్యమున్ [illegible] । కవివర్యు లటన్న మీరెగా । — పిల్లర కృష్ణమూర్తి.